# కొత్తపల్లి

## తెలుగు పిల్లల ఈ (e) మాస పత్రిక

సంచిక: 1 ఏప్రియల్ 2010 సంపుటి: 3

( http://kottapalli.in లోని e - సంచికకు పుస్తక రూపం )

### ఈ సంచికలో. . . .

**ముందు మాట**

చెట్లు నాటుదాం. . . సంపాదకీయం. . . 1

**ధారావాహికలు:**

నీతి చంద్రిక. . . చిన్నయసూరి. . . 4

**పిల్లలు చెప్పిన కథలు:**

దెబ్బకు దెబ్బ. . . ఆంజనేయులు. . . 10

ఓనకే ఓబవ్వ. . . పుష్ప. . . 14

పాము బుద్ధి. . . రాజు. . . 17

సన్మానాల పిచ్చి. . . విష్ణు. . 19

బంగారు పక్షి. . . . ఉష. . . 22

పిల్లన గ్రోవి. . . రేణుక. . . 24

వింత ప్రపంచం. . . త్రివేణి. . . 27

దివాను ఎంపిక. . . సుప్రజ. . . 31

**అనువాద కథలు:**

ముగ్గురు మూర్ఖులు. . . టాల్‌స్టాయ్. . . 33

నాగమాత కథ. . . రామానుజన్. . . 37

పిసినారి పాట్లు. . . పర్తాప్ అగర్వాల్. . .41

**అవీ-ఇవీ**

జంతువుల బడి. . . అరవింద గుప్తా. . . 47

**పాటలు:**

అమ్మా అమ్మా. . . గీతిక. . . 50

అందుకో దండాలు. . . జానకి బృందం. . .52

చిన్న పాటలు. . .

వసంతకాలం...నందన. . .54

రోజాపువ్వు. . . హరిత. . . 54

బంతి పాట. . . హర్ష. . . 55

అక్కయ్యక్కయ్య. . , రజని. . 55

జగ్ జగ్గి జాలాకు. . . సుధ. . 56

క్రికెట్. . . పవన్. . . 56

కాకీ-కాకీ. . . కల్పన. . . 57

బిస్కెట్లు. . . ధనుశ్రీ. . . 57

**మెదడుకు మేత**

మెలికలు...58

ఈ మాసపు ముఖచిత్రం

"కొత్తపల్లికి రెండేళ్ళు"




# చెట్లు నాటుదాం

"చెట్లు నాటిన మనిషి" అనే అద్భుతమైన కథ ఒకటుంది. అందులో ఒకాయన రోజూ క్రమం తప్పకుండా కనీసం వంద విత్తనాలు నాటుతుంటాడు. అంటే నెలకు మూడు వేల విత్తనాలు- సంవత్సరానికి ముప్పైఆరువేలు- మూడేళ్ళలో లక్ష! అలా ఆ మనిషి తను ముసలివాడై చనిపోయేవరకూ ప్రతిరోజూవిత్తనాలు నాటుతూ పోతాడు. అతను నాటిన లక్షలాది విత్తనాల్లో సుమారు మూడో వంతు మాత్రం మొలకెత్తి, పెరిగి, పెద్దవై, చెట్లౌతాయి. అయినా ఆ క్రమంలో కొన్ని వేల ఎకరాల బీడు భూమి దట్టమైన అరణ్యంగా మారిపోతుంది. వాగులూ, వంకలూ, నదులూ తిరిగి జీవం పోసుకుంటాయి. పక్షులూ, జంతువులే కాక, ఆ ఎడారిని వదిలిపెట్టి వలసపోయిన మనుషులు కూడా తిరిగి వస్తారు.

పనుల్ని విడువకుండా, ప్రతిరోజూ, ప్రతివారం, ప్రతినెలా చేస్తూ పోతే, అవి ఒకదానికి ఒకటి తోడవుతూ పోతాయి- చుక్క చుక్కా కలిసి మహాసముద్రం అయినట్లు.

కొత్తపల్లి పత్రికకు ఇప్పుడు రెండేళ్ళు నిండాయి. సర్వధారి ఉగాది(ఏప్రియల్ 2008)న కొంచెం అనుమానంగా, కొంచెం బిడియంగా, చాలా మామూలుగా రెండు బడుల పిల్లలకోసంవెలువడిన చిన్న, నలుపు-తెలుపు పత్రిక, రెండో సంవత్సరానికి రంగుల హరివిల్లయి, వెడల్పాటి పేజీలతో సొంపుగా తయారైంది.

## కొత్తపల్లి ఏప్రియల్ 2010

ఈ రెండేళ్ళలోనూ ఒక నూటయాభై పిల్ల రచయితల కథలు, ఓ వంద అనువాద కథలు, నూటయాభై పాటలు, నాలుగువందలకు పైగా రంగుల బొమ్మలు ఈ మాధ్యమం ద్వారా తెలుగు పిల్లలకు అందాయి. కనీసం ఓ రెండువేలమంది పత్రికని విడువకుండా ప్రతినెలా, ఇష్టంగా చదువుతున్నారు. ఓ నూరు-నూటయాభై మంది పిల్లలు 'తామూ రచనలు చేయగలం' అని తెలుసుకున్నారు; తమలోని కళాకారుల్ని గుర్తించారు. ఓ ఇరవై-ముప్ఫై మంది పల్లె పిల్లలు కంప్యూటర్లని సరిగ్గా వాడుకోవటంలో రకరకాల మెళకువల్ని నేర్చుకున్నారు. రాను రాను వీళ్ల సంఖ్యలు ఇంకా పెరుగుతాయి, ఎలాగూ.

"ఇదంతా జరిగేందుకు మేం పెట్టిన ఖర్చు చాలా తక్కువ" అనుకోవటం బాగుంది. మేం వెచ్చించిన సమయానికీ, పెట్టిన మనసుకూ, మీ ఆదరణకూ వెల కట్టుకోకపోతే ఇవన్నీ దాదాపు ఉచితంగా వచ్చినట్లే. ఈ పనికి కావలసిన సాంకేతిక పరికరాలు- కంప్యూటర్లు, ప్రింటర్లు, కెమెరా, శబ్ద గ్రహణ యంత్రం- వంటివాటిని అనేకంది మిత్రులు ఉదారంగా ఇచ్చారు, వాడుకొమ్మని. చాలామంది ప్రొఫెషనల్ చిత్రకారులు సమయం వెచ్చించి, కథలకు ఉచితంగా బొమ్మలు వేసి ఇచ్చారు. వీళ్ళందరికీ ధన్యవాదాలు.

అభ్యుదయ కళాకారిణి 'దేవి' గత సంవత్సరం టింబక్టు బడి పిల్లలకోసం ఒక నాటికను రచించటమే కాక, నెల రోజుల సమయం వెచ్చించి, దాన్ని పిల్లలకు నేర్పించి, వాళ్లచేత హైదరాబాదు రవీంద్రభారతిలో ప్రదర్శన ఇప్పించారు. ఆ నాటినుండీ అనుకోగా, ఆ నాటిక- "రెండు రాజ్యాలు- రెండు దారులు"- ఇన్నాళ్లకు అక్షర రూపం ధరించింది. జె.యన్.టి.యు లలిత కళల విద్యార్థి కొలుకులూరి శివప్రసాద్ దానికి చక్కని వర్ణచిత్రాలను అందించాడు. మన విద్యా విధానపు లోతుల్ని స్పృశించే ఈ నాటిక, ఈ మాసపు కొత్తపల్లికి అనుబంధం. రచయిత్రి దేవికీ, చిత్రకారుడు శివప్రసాదుకూ అభినందనలు.

కథల్నీ, పాటల్నీ, ఆటల్నీ ఇష్టపడని తెలుగుపిల్లలంటూ ఉండరు. కొత్తపల్లి పత్రిక వాళ్ళందరినీ చేరే

అవకాశం ఇప్పట్లో లేదు- అందుకని, స్వతంత్రంగా నడిచే కొత్తపల్లులు మరిన్ని తయారవ్వాల్సి ఉన్నది. ఊరుకొకటి- జిల్లాకొకటిగా అవి తెలుగు పిల్లలందరినీ చేరుకొని, వాళ్ళకు సంతోషాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ పంచాలి. వాటికి కావలసిన సాంకేతిక సహాయాన్నీ, ఇతర సలహాలనూ కొత్తపల్లి బృందం అందించగలదు. వికృతి నామ సంవత్సరం ఈ ప్రక్రియకు నాంది పలుకుతుందని ఆశిద్దాం.

అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలతో-

కొత్తపల్లి బృందం.

## చివరికి మిగిలేది!

తండ్రి: ఏరా, రాజేష్! నీకు ఎప్పుడూ సున్నా మార్కులే వస్తుంటాయి?

రాజేష్: మరి నేనేమి చెయ్యాలి నాన్నా? మా తరగతిలో 1 నుండి100 వరకు ఉన్న అంకెల్ని అందరూ పంచుకుంటారు; చివరికి నాకు మిగిలేది సున్న మాత్రమే!

*సేకరణ: యు. రేణుక, 8 వ తరగతి, ప్రకృతి బడి.*

## తిక్క ప్రశ్నలు- చిలిపి జవాబులు

ప్రశ్న: ఏనుగు తొండాన్ని రోడ్డుకు అడ్డంగా ఎందుకు పరిచింది?

జవాబు:పరుగెత్తే చీమలు దాన్ని తొక్కి బొక్కబోర్లా పడాలని!

ప్రశ్న:సరిగ్గా సగం పిల్లిలాగా ఉండేదేంటి?

జవాబు: మిగతా సగం పిల్లి.



# నీతి చంద్రిక

ఆరవ భాగం

*మూల రచన: కీ.శే. పరవస్తు చిన్నయసూరి*  *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

*జరిగిన కథ: కాకి, ఎలుకను తన స్నేహితుడైన తాబేలు దగ్గరికి తీసుకుపోతుంది. కుశలప్రశ్నల తరువాత తాబేలు అడిగితే, ఎలుక తన ఆత్మ కథను చెప్పసాగింది: చాలా సంపదను కూడబెట్టుకున్న ఆ ఎలుక బిలాన్ని త్రవ్వి, ఆ సన్యాసి దాని సంపదను మొత్తం హరిస్తాడు. 'ధనం లేనివాడు ఎందుకూ కొరగాడు' అంటాడు సన్యాసి దానితో, ఎగతాళిగా. ఎలుక తన ఆత్మకథను కొనసాగిస్తున్నది- ఇక చదవండి, నీతి చంద్రిక ఆరవభాగం.*

"ఆ సన్యాసి నన్ను చూస్తూ ఇట్లా చెబుతుంటే నేను చాలా దు:ఖించి, ఇట్లా అనుకున్నాను- “ఇక నేను ఇక్కడ నివసించకూడదు. నా యీ కథ ఇతరులతో చెప్పుకోవటానికి ఏమాత్రం తగనిది. 'ధననష్టం, మనస్తాపం, ఇంట్లో వాళ్ల చెడు ప్రవర్తన, మోసగింపబడటం, అవమానింపబడటం- ఇవి ఇతరులతో చెప్పుకో-జాలని విషయాలు' అని పెద్దలంటారు. దైవం

అనుకూలించక అవమానం పాలైనప్పుడు- సిగ్గున్నవాడికి వనవాసం కంటే సుఖమైనది వేరేదేదీ లేదు. అభిమానం గలవాడు పూలగుత్తి మాదిరి, అందరి కంటే ఉన్నతుడుగా, వాళ్ల తలల పైనైనా ఉండాలి; లేదా అడవిలోనే నశించిపోవాలి. 'ఇక్కడే బ్రతుక్కుంటూ, బిచ్చం ఎత్తుకొని జీవించేద్దామా' అంటే- దానికంటే నీచమైన పని ఇంకోటి లేదు. మనకంటే తక్కువ వాడిని ఒక్కడిని అడుక్కోవడం కంటే, నిప్పుల్లో పడి ఈ శరీరాన్ని త్యజించటమే మేలు. అబద్ధాలు చెప్పటంకంటే నోరు మూసుకొని మౌనంగా ఉండటం మేలు. ఇతరుల ధనాన్ని అపహరించటం కంటే బిచ్చం ఎత్తుకోవటం మంచిది. జ్ఞానం లేని యజమానిని సేవించటం కంటే అడవిలో బ్రతకటం ఉత్తమం. ఇతరులను ప్రాధేయపడుతూ బ్రతకటం కంటేచావు మేలు. ఇతరుల అడుగులకు మడుగులొత్తి బ్రతకటమే గౌరవాన్ని పోగొడుతుందంటే, ఇక 'యాచిస్తూ బ్రతకటం' అనేది ఏ కొద్దిపాటి గౌరవాన్నీ మిగలనీయదు. 'ఒకరి ఇంటిని ఆశ్రయించుకొని, వాళ్ళ బెదిరింపులకు తలఒగ్గి బ్రతకటం' అనేది చాలా నీచం" అని పలు విధాలుగా ఆలోచించాను."

"అయినా నా దురాశకు అంతులేక పోయింది. 'మళ్లీ ఏదో ఒక విధంగా ధనాన్ని సంపాదించి కూడబెట్టాలి' అనుకొని, అక్కడే ఉండసాగాను. చూడు- దురాశ వల్ల వస్తువుల పట్ల మితి లేని ప్రేమ కలుగుతుంది. ఆ మోహం దు:ఖాన్ని కలిగిస్తుంది. దు:ఖం అగ్ని లాంటిది. తనకు ఆశ్రయమిచ్చిన దానినే అది నాశనం చేస్తుంది. అందువల్ల తెలివిగలవాడు దురాశకు ఎన్నడూ లోబడడు. "

"అలా ఆ తర్వాత కూడా నేను ఆ స్థలాన్ని విడిచి పెట్టకుండా తిరుగుతుంటే చూసిన చూడాకర్ణుడు, ఒకసారి తన చేతిలోని కట్టెను నాపైకి విసిరివేశాడు. దేవుడి దయవల్ల ఆ వేటు తప్పిపోయింది గానీ, ఒకవేళ ఆ దెబ్బే తగిలి ఉంటే నేను ఈ పాటికి యమలోకంలో మ్రగ్గుతూ ఉండేదాన్ని. "

"ఆ తర్వాత నేను "అబ్బా! అన్ని కష్టాలకూ మూలం ఈ ధనాశయే కదా! ధన సంపాదన

కంటే లోకంలో సుఖం ఏదీ లేదు. అలాంటి సుఖంపై ఆశను వదిలిపెట్టిన వాడే గొప్పవాడు. 'అన్ని శాస్త్రాలూ చదివినవాడు' అనాల్సింది వాడినే. అట్లా ఆశను వదలి వేసినవాడే, అన్ని ధర్మాలనూ ఆచరించిన వాడు అవుతాడు. కడుపు నింపుకోవడానికి ఇతరులను పీడించకుండా, తనకు దొరికిన దానితో సంతోషపడే వాడొక్కడే ఈ లోకంలో ధన్యజీవి; సుఖజీవిన్నీ! ఎవరికైనా, వాళ్ల చేతల్ని బట్టే దు:ఖాలు గానీ, సుఖాలు గానీ ప్రాప్తిస్తున్నాయి. అందుకని, ఇక ఇక్కడ ప్రయాసపడటంలో అర్థం లేదు. నాకు ఈ చోటేమీ తాత ముత్తాతలు సంపాదించి పెట్టిన భూమి కాదు. ఈ భూమండలంలో ఇంక వేరే చోటేమీ లేదా, ఏమి? ఇక్కడ ఉండవలసిన అగత్యం ఏమున్నది? క్రూరుడైన యీ సన్యాసి చేత కర్ర-దెబ్బలు తింటూ ప్రాణాలు పోగొట్టుకునేది ఎందుకు? ఇంకా ఎక్కడైనా, మనుషులు లేని చోటును చేరుకొని ప్రొద్దుపుచ్చుటం మంచిది. కఠినమైన గండ శిలల లోపల కూడా కప్పకు జీవాన్ని ఇవ్వగల దయామయుడైన ఆ భగవంతుడు- ఇంత ఎలుకను, నన్ను కాపాడలేడా? “ అని ఆలోచించి, మనసును రాయి చేసుకొని, ఆ చోటును విడిచిపెట్టి, ఎవ్వరూ నివసించని ఆ అడవికి చేరుకున్నాను.”




“అడవిలో కాయకసుర్లు తిని, చిన్న గుంతల్లో నిలిచిన నీళ్లు త్రాగి, ఏదైనా చెట్టు నీడన కాలం గడపటం మంచిది గాని, సంపదను కోల్పోయి నలుగురి మధ్యా బ్రతకకూడదు. నేను చేసుకున్న పుణ్యం కొద్దీ ఆ తర్వాత నాకు యీ స్నేహితుడు దొరికాడు. మహాభాగ్యం వల్లనే నాకు 'నీ ఆశ్రయం' అనే స్వర్గం దక్కింది.

మంచివారి సాంగత్యాన్ని మించిన మేలు ఈ లోకంలో వేరే ఏదీ లేదు.

ఈ ప్రపంచం ఒక విష వృక్షం. అయినా అమృతంతో సమానమైనవి అందులో రెండు ఉన్నాయి: 'మంచి కావ్యం' అనే అమృతాన్ని రుచి చూడటం ఒకటి; మంచివాళ్లతో కలిసి బ్రతకటం రెండవది " అని తన ఆత్మకథను ముగించింది ఎలుక.

శ్రద్ధగా విన్న తాబేలు, దురాశ గురించి చెబుతూ, ఇలా అన్నది:

" సంపదలు శాశ్వతాలు కావు. వాగుల్లో నీరు వేగంగా ప్రవహించి పోయినట్లు, యౌవనం కూడా వేగంగా వెళ్లిపోతుంది. జీవితం బుడగలాంటిది. అందువల్ల బుద్ధిమంతుడు త్వరగా ధర్మకార్యాలు చేయాలి. అలా ధర్మాన్ని సమాచరించని వాడు ఆ తర్వాత దు:ఖానికి లోనై, శోకం అనే మంటలో దహించుకు-పోతాడు. నువ్వు అతిగా కూడబెట్టావు. దాని ఫలితమే ఇది. చెరువులో ఉండే నీళ్లకు మొరవ ఎలా రక్షణ నిస్తుందో, అదే విధంగా- సంపాదించబడిన ధనానికి త్యాగమే రక్షణ.

బీరువాల లోను, నేలమాళిగ లోను దాచటం ఆ ధనాన్ని పోగొట్టుకోవటానికే తప్ప, వేరు కాదు. ఇతరుల నోరుకొట్టి, కడుపు కొట్టి, తాను తినక, ఇతరులను తిననివ్వక డబ్బు సంపాదించేవాడికి, ఇతరుల కోసం బరువులు మోసేవాడికి మాదిరి, ఆ బరువు(కష్టం) మాత్రమే లభిస్తుంది. తాను సుఖంగా గడిపేందుకు, ఇతరులకోసం వదిలిపెట్టేందుకు ఉపయోగపడని డబ్బు ఉండటం వల్ల ప్రయోజనం ఏముంది, అది పోతే నష్టం మాత్రం ఏమున్నది? పిసినారి వాడు ఎంత ధనికుడైనా, తను సుఖపడడు- ఆ విధంగా అతడు దరిద్రుడితో సమానమే. అయినా ధనాన్ని సంపాదించటంలోను, దానికి కాపలా కాయటంలోను, దాన్ని పోగొట్టుకోవటంలోను- ఈ మూడింటిలోనూ పిసినారికి వచ్చేది దు:ఖమే.

పిసినారి తన సంపదను- ఇతరులకు పెట్టడు; బంధువులకోసం ఖర్చు చేయడు; తాను కూడా తినడు- చివరికి ఆ సంపదంతా నేలపాలైనా అవుతుంది; దొంగల పాలైనా

అవుతుంది. లోకంలో ఎంతో కష్టం మీద గానీ లభించని విషయాలు నాలుగు ఉన్నాయి: 'ప్రేమగా మాట్లాడుతూ ఇచ్చే దానము, గర్వం తోడుగా లేని జ్ఞానము, క్షమాగుణంతో కూడుకున్న వీరత్వము, త్యాగగుణంతో ఉండే డబ్బు'- ఈ నాలుగూ ప్రపంచంలో అంత సులభంగా దొరకవు. 'ధన సంపాదన' అనే పనిని బుద్ధిమంతుడు ఎల్లప్పుడూ చేయవలసిందే- కానీ అతిగా కూడబెట్టాలన్న కోరిక తప్పు. ఇది వరకు ఒక నక్క దురాశ కొద్దీ ఎక్కువ సంపాదించాలని పోయి, వింటి దెబ్బ తగిలి చచ్చింది. విను, నీకు ఆ కథ చెబుతాను.

'కల్యాణ కటకం ' అనే పట్టణంలో భైరవుడు అనే వేటగాడు ఒకడు ఉండేవాడు. వాడు ఒకరోజున విల్లు, బాణాలు, వల త్రాళ్లు, భోజనపు మూట మొదలైన సాధనాలన్నిటినీ తీసుకొని, వేటకోసం వింధ్యారణ్యానికి వెళ్లాడు. అక్కడ , వాడు తాను దాక్కొనటం కోసం ఒక మరుగును ఏర్పరచుకొని, జంతువులను ఆకర్షించేందుకై ఎరను పెట్టి, పొంచి కూర్చున్నాడు. ఆ పైన అతను అక్కడికి వచ్చిన జింకను ఒకదాన్ని బాణంతో కొట్టి చంపాడు. బాగా బలిసిన ఆ జింకను భుజం మీద పెట్టుకొని అతను వస్తూంటే, ఒక అడవి పంది అతనికి ఎదురు అయింది. చూస్తే అది నడుస్తున్న కొండేమో' అనిపిస్తున్నది.




అప్పుడు ఆ వేటగాడు " ఆహా! నా అదృష్టం కొద్దీ ఇంకో జంతువు కూడా దొరకబోతున్నది " అని సంతోషపడి, భుజం మీద ఉన్న జింకను క్రిందికి దించి, విల్లు ఎక్కుపెట్టి, బాణం సంధించి, పంది మీదికి వదిలాడు. దెబ్బ తగిలిన మరుక్షణమే ఆ పంది కోపంతో రెచ్చిపోయి, భయంకరంగా గర్జిస్తూ, బాణం మాదిరి దూసుకొని వచ్చి వాడిని చీల్చి వేసింది.

ఆ దెబ్బకు వాడు మొదలు నరికిన చెట్టులాగా నేలకూలి, బాధతో అరుస్తూ ప్రాణం విడిచాడు. బాణం దెబ్బ తగిలిన పంది కూడా చచ్చిపోయింది. అక్కడే ఉన్న పాము ఒకటి, వాటి త్రొక్కుడులో పడి, నలిగి చచ్చింది.




ఆ తర్వాత కొంతసేపటికి, " దీర్ఘరావం " అనే నక్క ఒకటి ఆహారంకోసం అడవిలో అంతా వెతుక్కుంటూ అక్కడికి వచ్చి చేరుకొని, ఆ ప్రాంతంలో పడి ఉన్న రకరకాల జీవులను చూసి చాలా సంతోషించింది. "ఆహా! నాకు భోజనం పుష్కలంగా దొరికింది. వీటి మాంసం నాకు మూడు నెలల వరకూ సరిపోతుంది: జింక-పందిల మాంసాల్ని రెండు నెలల పాటు తినచ్చు. ఈ వేటగాడి మాంసాన్ని నెల రోజుల పాటు తినచ్చు. పాము ఒక్క రోజుకు సరిపోతుంది. మరి, ఇప్పటి ఆకలి తీరటం కోసం ఏమి తినను? ఈ ధనస్సుకు తాడు బదులు గట్టి నరం కట్టి ఉంచాడు, వేటగాడు. ఈ రోజుకు నాకు ఆ నరం ఒక్కటే చాలు" అనుకున్నది. ఆ పైన అది విల్లు దగ్గరికి చేరుకొని, దానికి గట్టిగా లాగి కట్టి ఉన్న నరాన్ని చప్పరిస్తూ పంటితో కొరకగానే, అది పుటుక్కున తెగింది. అలా హటాత్తుగా పట్టు వదిలిన ఆ వింటి త్రాడు వచ్చి బలంగా నక్క రొమ్ముకు తాకగానే, ఆ నక్క నేలబడి అరుస్తూ, విలవిలా తన్నుకొని, చచ్చింది. చూడు, దురాశ నక్కను ఏ గతికి తెచ్చిందో! "

"అందుకనే, 'అతిగా కూడబెట్టాలన్న కోరిక మంచిది కాదు' అని చెప్పాను. ఇతరులకు ఇచ్చి, తాను తిన్నదే తన సొత్తు. ఇతరులకు ఇయ్యక, తాను తినక, కూడబెట్టిన ధనం చచ్చినప్పుడు వెంటరాదు" అని చెప్పి, తాబేలు ఇంకా ఇట్లా అన్నది- (మిగతాది మళ్ళీ...)



# దెబ్బకు దెబ్బ

*పర్షియన్ జానపద కథ*

*సేకరణ: S. ఆంజనేయులు, 8 వ తరగతి, ప్రకృతి బడి, చెన్నేకొత్తపల్లి.*

అనగా అనగా బాగ్దాదు నగరంలో అబూసలీం, సుల్తాన్ అహ్మద్ అనే ఇద్దరు మిత్రులు ప్రక్కప్రక్క ఇళ్లలో ఉండేవాళ్ళు. అబూకు దైవభక్తి ఎక్కువ. తనకు ఎలాంటి కష్టం వచ్చినా బిగ్గరగా నమాజు చేసి భగవంతుడికి మొరపెట్టుకునేవాడు. సుల్తాన్ అహ్మద్ కు తన మిత్రుని ఈ ప్రవర్తనని చూస్తే ఎగతాళిగా ఉండేది. ఎలాగైనా అబూనుంచి ఈ అలవాటును దూరం చెయ్యాలని అతను తగిన సమయంకోసం వేచి చూడసాగాడు.

ఒకసారి అబు ఎప్పటిమాదిరే బిగ్గరగా నమాజు చేసి, దేవునితో తన కష్టాలు మొరపెట్టుకున్నాడు- "సంపాదన తక్కువౌతున్నది, ఖర్చులు చూస్తే పెరిగిపోతున్నాయి- ఎలాగైనా కాపాడే భారం నీదే" అని. ప్రక్క ఇంట్లోంచి వింటున్న సుల్తాన్

అహ్మద్ కు ఇదే తగిన సమయం అనిపించింది. ఒక సంచీలో కొన్ని బంగారు నాణాలు వేసి, మూటగట్టి, వాటిని గబుక్కున నమాజు చేస్తున్న అబూసలీం ఒళ్ళో పడేట్లు గిరాటు వేశాడు.

కళ్ళు తెరిచి చూసిన అబూసలీం తన ఒళ్ళో పడ్డ సంచీని తెరిచి చూశాడు. బంగారు నాణాలు! ఇది ఎవరి తుంటరిపనో అబూకు వెంటనే అర్థం అయ్యింది. అయినా 'ఇది అల్లా తనకిచ్చిన కానుక' అనుకొని, అతను దాన్ని తీసుకొని సంతోషంగా ఇంట్లోకి పరుగుతీశాడు.

కొంచెం సేపు గడిచిందోలేదో, సుల్తాన్ అహ్మద్ ప్రత్యక్షం అయ్యాడు. అబుకు అతను ఎందుకొచ్చాడో అర్థం అయ్యింది. అయినా ఏమీ తెలీనట్లు, "ఈరోజు చమత్కారం ఒకటి జరిగింది సుల్తాన్, నేను అటు నమాజ్ చేసి లేచానో-లేదో, ఇటు అల్లా నా మొర విని, నాకు ఈ బంగారు నాణాల సంచీని ప్రదానం చేశాడు!" అన్నాడు సంచీని చూపిస్తూ.

"అది అల్లా ఇచ్చిన డబ్బు కాదు! నీ పిచ్చి వదిలిద్దామని, నేనే వాటిని నీమీదికి విసిరాను" అన్నాడు సుల్తాన్ అహ్మద్, ఇకిలిస్తూ.

"అదెలా అవుతుంది? అల్లా నాకిచ్చిన డబ్బు నాదే అవుతుంది" అన్నాడు అబూసలీం, గడుసుగా. ఇది వేరేవైపుకు మళ్ళుతున్నదని అర్థమైంది సుల్తాన్ అహ్మద్ కు. "ఇదిగో, చెబుతున్నాను- అది అల్లా డబ్బు కాదు. నీదీ కాదు. అది నా డబ్బు. మర్యాదగా నా డబ్బు నాకు ఇవ్వకపోతే న్యాయం కోసం ఖాజీ దగ్గరికి పోవాల్సివస్తుంది- ఏమనుకుంటున్నావో, ఏమో!" అన్నాడు కోపంగా.

"నాకేం భయం? నా డబ్బు నాదే. దాన్నెవరూ నానుండి లాక్కోలేరు- ఖాజీ అయినా సరే" అన్నాడు అబూ మొండిగా.

"సరే, అయితే పద, ఖాజీ దగ్గరికి నడు!" అన్నాడు సుల్తాన్ అహ్మద్, చికాకుగా.

"వద్దామనే ఉంది, కానీ నాకు మంచి బట్టలే లేవాయె, బయటికెలా వచ్చేది?" అన్నాడు అబూ.

సుల్తాన్ అహ్మద్ తన ఇంట్లోంచి ఒక జత బట్టలు తెచ్చి ఇచ్చాడు, "ఇక బయలుదేరు" అని.

అబు వాటిని వేసుకున్నాడు, కానీ కదల్లేదు- "టోపీ లేనిదే మర్యాదస్తులు బయటికెలా వస్తారు?" అని.

సుల్తాన్ అహ్మద్ మళ్ళీ తన ఇంట్లోంచే టోపీ తెచ్చి ఇచ్చాడు.

అయినా కదల్లేదు అబు. "చెప్పుల్లేవు" అని.

సుల్తాన్ అహ్మద్ విసుక్కుంటూ చెప్పులు తెచ్చి ఇచ్చాడు.

"మరి గుర్రం?" అన్నాడు అబు.

"గుర్రంకూడా నేనే తెచ్చివ్వాలా?" అని విసుక్కున్నాడు సుల్తాన్ అహ్మద్.

"తప్పదు మరి, నాకు గుర్రం లేదు- నేనెలా వస్తాను, ఖాజీ దగ్గరికి?" అన్నాడు అబు.

అబుకో గుర్రాన్ని తెచ్చిపెట్టక తప్పలేదు సుల్తాన్ అహ్మదుకు.

అప్పుడుగాని అబు కదల్లేదు. ఇక ఇద్దరూ ఖాజీ దగ్గరికి వెళ్ళగానే, అబు తన డబ్బు తీసుకొని ఇవ్వట్లేదని ఫిర్యాదు చేశాడు సుల్తాన్ అహ్మద్.

"అయ్యా, వీడు నా మిత్రుడే- ఆరోగ్యం సరిగా లేదు పాపం. ఈ డబ్బు తనదంటున్నాడు, సరే- మరి నేను వేసుకున్న బట్టలూ, నేను పెట్టుకున్న టోపీ, ఈ చెప్పులూ, నేనెక్కిన ఈ గుర్రమూ- ఇవన్నీ ఎవరివో అడగండి" అని అబు ఊదాడు మర్యాదగా, ఖాజీ చెవిలో.

"ఏమోయ్, మరి ఇతనెక్కిన ఈ గుర్రం ఎవరిది?" అన్నాడు ఖాజీ.

"నాదే" అన్నాడు సుల్తాన్ అహ్మద్.

"ఇతను వేసుకున్న చెప్పులు?"

"నావే" అన్నాడు సుల్తాన్ అహ్మద్, ఇవన్నీ ఎందుకు అడుగుతున్నాడో అర్థం కాక.

"మరి ఇతను పెట్టుకున్న టోపీ?"

"అదీ నాదే" చెప్పాడు సుల్తాన్ అహ్మద్.

"ఓహో, ఔనా, మరి ఇతను వేసుకున్న బట్టలు?"

"అవీ నావే"

ఖాజీ అతని వైపు జాలిగా చూశాడు. ఆపైన ఆయన అబు వైపు చూశాడు.

"మరి అదేనండి, నేను అన్నది" అన్నాడు అబు, వినయం నటిస్తూ.

ఖాజీ కేసు కొట్టేశాడు. "మీ మిత్రుడిని

ఎవరైనా మంచి మానసిక వైద్యుడికి చూపించు" అని అబుకు సలహా ఇస్తూ.

ఇద్దరూ ఇల్లు చేరాక, అబు తన మిత్రుని వస్తువుల్ని అన్నిటినీ వెనక్కి తిరిగి ఇచ్చేశాడు. సుల్తాన్ అహ్మద్ డబ్బు సంచీతో సహా.

ఆపైన సుల్తాన్ అహ్మద్ ఏనాడూ అబుకు పాఠం చెప్పేందుకు ప్రయత్నించలేదు.

## చాలా దూరం!

టీచరు: భూమికి చంద్రుడికి మధ్య దూరం కొలవాలంటే ఎన్ని దారపు ఉండాలు కావాలి?

విద్యార్థి: పూర్తి పొడవు ఉండేది- ఒక్కటి చాలు.

## జైలు యోగం!

టీచరు: "నేనొక వ్యక్తిని చంపాను" - భవిష్యత్ కాలంలోకి మార్చి చెప్పరా!

విద్యార్థి: "మీరు జైలుకు పోతారు" సర్!

## ఉపాయం!

కొడుకు: నాన్నా! నా ప్రోగ్రెస్ కార్డు మీద నువ్వెప్పుడూ సంతకం చెయ్యవెందుకు? వేలిముద్రే ఎందుకు వేస్తావు?

తండ్రి: ఏం లేదురా! నీ అంత బాగా చదివే కొడుకును కన్నవాళ్లకు చదువురాదు అని మీ టీచరు అనుకొని నిన్ను కొట్టకుండా వదిలేస్తుందని!




# ఓనకే ఓబవ్వ

*కర్ణాటక చారిత్రక కథ*



*సేకరణ: G. పుష్ప, 8 వతరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

ప్రస్తుతం కర్ణాటక రాష్ట్రంలో ఉన్న చిత్రదుర్గలో పుట్టింది ఓబవ్వ. 18 వ శతాబ్దికి చెందిన ఓబవ్వ గురించి తెలీనివాళ్ళు ఆ ప్రాంతంలో లేరంటే అతిశయోక్తి కాదు. మహిళల స్థైర్యానికీ, ధైర్య సాహసాలకూ పెట్టిన పేరైన ఓబవ్వను కర్ణాటక వాసులు ఈనాటికీ గర్వంగా తలచు-కుంటుంటారు.

ఆరోజుల్లో చిత్రదుర్గను 'మదకరి నాయకుడు' అనే రాజు పరిపాలించేవాడు. చిత్రదుర్గను శత్రువుల బారి నుండి కాపాడు-కోవటంలోనే ఆయన సమయం అంతా వెచ్చించాల్సి వచ్చేది. మైసూరుకు చెందిన హైదరాలీ చిత్రదుర్గనును వశం చేసుకోవాలని అనేక సార్లుగా ప్రయత్నం చేస్తున్నాడు.

ఏమాత్రం సందు దొరికినా హైదరాలీ సైన్యం రాజ్యాన్ని అతలాకుతలంచేస్తుంది.

అందుకని మదకరి నాయకుడు కోట రక్షణకోసం అనేక అంచెల కావలి ఏర్పరచాడు. ఓబవ్వ భర్త కోట బురుజుకు కావలి. కోట దరిదాపుల్లోకి ఎవరైనా శత్రువులు వస్తే, శంఖం ఊది సైనికులను పిలవటం అతని పని. అతను అలా శంఖం ఊదగానే ఇలా సైనికులు వచ్చి యుద్ధం చేసి శత్రువులను ఓడించేసేవాళ్ళు. అలా ఆమె భర్త పని ప్రమాదంతో కూడుకున్నది కాకపోయినా, బాధ్యతతో కూడుకున్న పని అన్నమాట.

ఒకనాడు మధ్యాహ్నం ఓబవ్వ భర్త భోజనానికి ఇంటికి వచ్చాడు. భర్తకు భోజనం వడ్డించి, ఓబవ్వ నీళ్లకోసం చూసింది. చూడగా కడవలో నీళ్లు లేవు. బిందె తీసుకొని నీళ్లకు బయలుదేరిన ఓబవ్వ చెరువు దగ్గరికి చేరుకునేసరికి, ఘోరమైన ప్రమాదం ఒకటి ఆమె కంట పడింది.

కోట వెనుకవైపున గోడకు నేలబారున ఒక చిన్న రంధ్రం పడి ఉన్నది. ఆ రంధ్రంగుండా హైదరాలీ సైనికుడు ఒకడు కోటలోపలికి దూరుతున్నాడు. వాడి వెనుక ఇంకా చాలా మంది సైనికులే ఉండి ఉండాలి!

ఓబవ్వ బిందెను అక్కడే పడేసి భర్తను హెచ్చరించేందుకని ఇంటికి పరుగెత్తింది. భర్త ఇంట్లో నిదానంగా భోజనం చేస్తున్నాడు. అన్నం తింటున్న భర్తను తొందరపెట్టటం ఇష్టం కాలేదు ఓబవ్వకు. మరి ఏం చేయాలి? అతనికి ఏమీ చెప్పకుండానే పోయి, మూలగా ఉంచిన 'ఓనకే'(రోకలి బండ)ను చేత పుచ్చుకొని, కోట వెనుకవైపుకు పరుగుతీసింది ఓబవ్వ.

ఆ సమయానికే శత్రు సైనికుడు ఒకడు సన్నటి ఆ రంధ్రం లోంచి లోపలికి దూరుతున్నాడు. పరుగున అక్కడికి చేరుకున్న ఓబవ్వ, తన చేతిలో ఉన్న రోకలిబండతో వాడి నెత్తిన ఒక్కటిచ్చింది. వాడు దిమ్మెరపోగానే వాడిని లాగి లోపల పడేసింది. ఈ సంగతి తెలీని శత్రు సైనికులు ఒక్కరొక్కరే లోనికి దూరటం, ప్రక్కనే రుద్రమూర్తిలా నిలబడ్డ ఓబవ్వ వాళ్లను కొట్టి ఈడ్చి పడెయ్యటం జరుగుతూ పోయింది.

ఓబవ్వ భర్త భోజనం ముగించుకొని, లేచి వచ్చి చూస్తే ఓబవ్వ కనబడలేదు. అతను ఓబవ్వను వెతుక్కుంటూ చూసేసరికి, కోట వెనుక గోడకు రంధ్రం పడి ఉన్నది! గోడ వారగా నిలబడ్డ ఓబవ్వ రోకలిబండతో శత్రు సైనికుడొకణ్ణి చితక బాదు తున్నది. ఆమె వెనుక పందలాది మంది శత్రుసైనికులు కుప్పగా పడి ఉన్నారు!

అలికిడికి వెనక్కి తిరిగిన ఓబవ్వ భర్తను హెచ్చరించి, శంఖం ఊదమన్నది. అతను శంఖం ఊదగానే సైనికులు సచేతనమై పరుగున వచ్చారు. "వెళ్ళండి! మన రాజ్యాన్ని నాశనం చేసేందుకు వచ్చిన దుష్టులు ఇంకా ఎక్కడున్నారో వెతికి మట్టుపెట్టండి" అని అరిచింది ఓబవ్వ.

సైనికులు కోట రక్షణలో మునిగారు. అయితే అప్పటికే తప్పించుకున్న శత్రు సైనికుడొకడు వెనుకనుండి వచ్చి, ఓబవ్వను కత్తితో పొడిచాడు. వెంటనే వెనక్కి తిరిగిన ఓబవ్వ రుద్రకాళిలా అతన్ని కూడా సంహరించింది. కానీ ఆమెకు గాయం బలంగా తగిలింది. దాన్నుండి ఓబవ్వ ఇక కోలుకోలేకపోయింది. రాజ్య సంరక్షణలో ఆమె అసువులు బాసింది.

ఓబవ్వ ఆనాటినుండి ఓనకే ఓబవ్వ (రోకలిబండ ఓబవ్వ) అయింది. కన్నడ మహిళల స్థిర చిత్తానికీ, దేశభక్తికీ, ధైర్య సాహసాలకూ ప్రతీకగా నిలిచింది.

చిత్రదుర్గలోని క్రీడాప్రాంగణానికి "ఓనకే ఓబవ్వ క్రీడా ప్రాంగణం" అని పేరు.

## గొప్ప అర్థం!

టీచరు: “తమసోమా జ్యోతిర్గమయ” అంటే ఏంటో చెప్పరా, రణబీర్?

రణబీర్: నేను హిందీలో చెబుతాను టీచర్!

టీచరు: సరే, చెప్పు.

రణబీర్: తుం సోవోమా, మై జ్యోతీ కే పాస్ జాతా హూ.





# పాము బుద్ధి

*రచన: V.రాజు, 6 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

సోంపల్లెలో ఒక మంచి రైతు రంగయ్య ఉండేవాడు. రంగయ్య మనసు మంచిది. ఊళ్ళో వాళ్ళకు ఏ కష్టం వచ్చినా వచ్చి రంగయ్యతో చెప్పుకునేవాళ్ళు. రంగయ్య వాళ్లకు తన చేతనైన సాయం చేస్తుండేవాడు.

ఒకసారి రంగయ్య పొలం దున్నుతుంటే ఒక పాము కనబడ్డది. మామూలు రైతులైతే పాము కనబడగానే దాన్ని చంపేస్తారు- అది విషపు పురుగా, కాదా అని కూడా చూడరు. కానీ రంగయ్య ఒక క్షణం ఆగి 'అది ఏ పాము' అని చూశాడు. చూడగా అది విషపు పాము! రంగయ్య దాన్ని చంపేద్దామనుకుంటుండగా అది అన్నది- "రంగయ్యా! నేను పుట్టిందే నీ పొలంలో. ఇన్నాళ్ళూ నీపొలం లోని ఎలుకల్ని తిని నీ పంటను కాపాడాను. ఇప్పుడు నేను ఇల్లు-వాకిలీ కోల్పోయి, చలికి వణుకుతూ

దీనదశలో ఉన్నప్పుడు నువ్వు నన్ను చంపుతావా? దయచూడు!" అని.

రంగయ్యకు దానిమీద జాలి కలిగింది. దాన్ని ఇంటికి తీసుకెళ్ళి పొయ్యి దగ్గర, వెచ్చగా ఉండే ప్రదేశంలో ఉంచి కాపాడాడు. దానికంటూ ఒక బుట్టను ఏర్పరచి, దాన్ని జాగ్రత్తగా సాకటం మొదలుపెట్టాడు. తను పొలానికి వెళ్ళేటప్పుడు రోజూ దాన్ని పొలానికి తీసుకెళ్ళేవాడు.

ఒకసారి ఆ పాము బుట్టలోంచి బయటికి వస్తుండగా చూసిన గ్రద్ద ఒకటి రివ్వున వాలి దాన్ని పట్టుకోబోయింది. దగ్గర్లోనే విత్తనాలు వేస్తున్న రంగయ్య తన చేతుల్లోని కొడవలిని గ్రద్దపైకి విసరకపోతే పాము పని ఆఖరయ్యేది. ఒక సారి పిల్లి ఒకటి దాన్ని పట్టుకోబోయింది. మళ్ళీ రంగయ్యే, సమయానికి పిల్లిని తరిమి, పామును రక్షించాడు. అలా చాలాసార్లు రంగయ్య దాన్ని శత్రువుల బారినుండి కాపాడాడు.

ఒక రోజున పాముకు తినేందుకు ఏవీ దొరకలేదు. ఆకలిగొని ఉన్న పాముకు గతం గుర్తొచ్చింది. రంగయ్య తనను చంపబోవటం గుర్తుకు వచ్చింది దానికి. రంగయ్య దయాగుణాన్ని మరచిన పాము, క్రోధంతో ఉడికిపోయింది. మెల్లగా రంగయ్య వెనక చేరి, కాటు వేసేందుకు పడగనెత్తింది.

గిరుక్కున వెనక్కి తిరిగిన రంగయ్య, గబుక్కున దాని తలను దొరకబుచ్చుకున్నాడు. వదిలెయ్యమని ప్రాధేయపడుతున్న పాము మాట వినకుండా ఓ కట్టెపుల్లతో దాని నోటిని తెరచి పట్టుకొన్నాడు. దాని కోరలు రెండింటినీ- ఆ కోరల వెనక ఉన్న విషపు తిత్తులతో సహా- పీకేశాడు. ఇకమీద అది ఎవరికీ హాని చెయ్యలేదు! ఆపైన దాన్ని పొలంలోనే వదిలిపెట్టేశాడు.

'చూడు, ఏం చేసినా పాము బుద్ధిమారలేదు' అనుకున్నాడు రంగయ్య, మనసులో.

'చూడు, మనిషి తన బుద్ధిని పోనిచ్చుకోలేదు' అనుకున్నది పాము, జరజరా దూరంగా పోతూ.




# సన్మానాల పిచ్చి

*తెలుగు జానపద కథ*

*సేకరణ: V.విష్ణు, 9 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*



అనగా అనగా ఒక కటికవాడు ఉండేవాడు. కటికవాడు అంటే తెలుసుకదా, కసాయివాడు అన్నమాట. జంతువుల్ని కోసి, మాంసం అమ్ముకుని జీవించేవాడు. అతని ఇంట్లో ఒక మేక ఉండేది. ఒకసారి అది పిల్లల్ని ఈనే సమయం దగ్గరపడింది. అతని భార్య రోజూ మేకల్ని తోలుకొని అడవికి పోయేది. తలారివాడు భార్యను పిలిచి- "చూడు, దీనికి ఆడమేక పుడితే వెనక్కి తీసుకురా. అలాకాక పోతు పుడితే అక్కడే వదిలేసి రా!" అని చెప్పాడు.

ఆ రోజునే మేక పోతును ఈనింది. తలారివాడి భార్య ఆ పిల్లను అక్కడే వదిలేసి మిగిలిన మందతో ఇంటికి వెళ్ళిపోయింది.

అయితే తల్లిపాలకు నోచుకోని ఆ మేకపోతు అదృష్టం బాగుందేమో, అది బ్రతికింది- ఊరికే బ్రతకటమే కాదు- అడవిలో దొరికే ఆకులూ అలములూ, గడ్డీ గాదం మేసి మేసి బాగా లావుగా, బలంగా తయారైంది. బలంతోబాటు దానికి విపరీతమైన గర్వమూ, ధైర్యమూ వచ్చినై.

అయితే దానికి కాలం మూడే సమయానికి, అది తనకు కనబడిన ఒక గుహలో దూరి నిద్రపోతున్నది. ఆ గుహ ఒక నక్కది. ఆహారంకోసం బయటికి వెళ్ళిన నక్క వెనక్కి తిరిగి వచ్చి, తన గుహలోకి ఎవరో దూరారని గుర్తించింది. గుహచుట్టూ ఒకటి రెండుసార్లు తిరిగినా దానికి తన గుహలో దూరిందెవరో అర్థం కాలేదు. అందుకని అది పెద్ద గొంతుకతో "ఎవరది, గుహలో ఉన్నది?" అని అరిచింది.

"ఎవరని అడుగుతావా, నేనురా, గువ్వ చెవ్వులవాడిని, బాడిశె గడ్డపు వాడిని, బార్సి బార్సి పొడుస్తానురోయ్! జాగ్రత్త!!" అని లోపలినుండే అరిచింది మేక.

"ఓహో! ఇది మేక! నా ఆహారం నా యింట్లోకి నడిచి వచ్చింది, ఈ రోజు నాకు పండగే!" అనుకున్న నక్క అమాంతం లోపలికి దూకి, మేకను పట్టుకొని చంపేసింది.

అయితే అది ఎంత తిన్నా, మేక మాంసం అయిపోలేదు. ఆయాసం వచ్చిన నక్కకు అప్పుడుగాని స్నేహితులు గుర్తుకు రాలేదు. "ఓయ్, రండి రండి! నేను మీకోసం మంచి మేకను చంపి పెట్టాను. రండి! వచ్చి తినండి!" అని అది ఊళ పెట్టగానే, దగ్గర్లో ఉన్న నక్కలన్నీ పరుగున వచ్చి, మేకను చూసి సంతోషంగా కేకలు పెట్టాయి.

"తినండి తినండి! మీకు ఇంత మంచి ఆహారం సంపాదించిపెట్టినందుకు నాకు మీరంతా కలిసి సన్మానం చేయండి" అన్నది నక్క గర్వంగా.

నక్కలన్నీమేకను కడుపారా మెక్కి, ఒక తడకను ఎత్తుకొచ్చి, దానికి రెండువైపులా తాళ్ళు కట్టి, దానిమీద నక్కను కూర్చొబెట్టుకొని , దాని కాళ్ళకు, చేతులకు తాళ్లతో ముడులు వేసి, తడకను భుజాలమీద ఎత్తుకొని అరుచుకుంటూ ఊరేగించటం

మొదలుపెట్టాయి.




నక్కల గొడవకు చుట్టూ ఉన్న జంతువులన్నీ చెవులు మూసుకున్నె గానీ, సన్మానపు మత్తులో ఉన్న నక్కకు అదేదీ పట్టలేదు. నక్కల ఊరేగింపు సింహం గుహ దగ్గరకు చేరుకునే సరికి, అప్పటికే ఆకలితో చికాకుగా ఉన్న సింహం దిక్కులు పిక్కటిల్లేట్లు గర్జించింది. మరుక్షణం నక్క మిత్రులన్నీ తడకను క్రిందపడేసి తలో దిక్కుకూ పరుగులెత్తాయి. తడకకు కట్టబడి ఉన్న నక్క ఎటూ పారిపోలేక ఏడవసాగింది. దిక్కులు తెలీనట్లు పరుగెత్తుతున్న మిత్రుల కాళ్లక్రింద పడి దానికి నడుం విరిగినంత పనైంది. చివరికి సింహం దయతలచి దాన్ని వదిలింది గానీ, లేకపోతే నక్క ప్రాణాలు ఆనాడే గాలిలో కలిసి పోయేవి!

చావు తప్పి కన్ను లొట్టబోయిన నక్కకు ఆ రోజుతో సన్మానాల పిచ్చి వదిలింది.

## అయస్కాంతత్వం!

**ప్రశ్న:** ఒక అయస్కాంతం ఇంకో అయస్కాంతంతో ఏమంటుంది?

**జవాబు:** "నీలో చాలా ఆకర్షణ శక్తి ఉంది"




# బంగారు పక్షి



*రచన: R.ఉష, ఏడవ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

అనగా అనగా ఒక ఊళ్ళో మల్లయ్య అనే రైతు ఉండేవాడు. అతని భార్య సుబ్బమ్మ. ఒకరోజున, మల్లయ్య పొలానికి వెళ్తుండగా అతనికి ఒక బంగారు పక్షి కనబడ్డది. అది ఒక అరుగు మీద కూర్చొని ఉన్నది. మల్లయ్యకు దాన్ని చూస్తే ముచ్చట వేసింది. అయితే అదే సమయానికి గుంటనక్క ఒకటి పక్షి వెనకగా వచ్చి దాన్ని పట్టుకోబోయింది. మల్లయ్య వెంటనే తన చేతిలోఉన్న కర్రను నక్కమీదికి విసిరేసాడు. బంగారు పక్షి ఉలిక్కిపడి చూసేసరికి, గుంటనక్క తన వెనుకనే ఉన్నది. వెంటనే అది ఎగిరిపోయింది; గుంటనక్క కూడా అడవిలోకి పరుగుతీసింది.

ఆ బంగారు పక్షి చాలా మంచిది. "నన్ను రక్షించినందుకు నీకు చాలా ధన్యవాదాలు మనిషీ" అనుకున్నది అది, తన మనసులో.

మరుసటిరోజున అది మల్లయ్యకోసం అదే అరుగు మీద కూర్చొని ఎదురుచూసింది. కానీ మల్లయ్య రాలేదు. ఎందుకంటే, మల్లయ్యకు ఆరోగ్యం బాగా లేకుండింది. ఆ తరువాత మల్లయ్య రెండు రోజులు మాత్రమే బ్రతికాడు- తరువాత అతను చనిపోయాడు.

బంగారు పక్షి అతనికోసం ప్రతిరోజూ ఎదురుచూసేది. చివరికి అది మల్లయ్యను వెతుక్కుంటూ అతని ఇంటికి పోయింది. అప్పుడుగాని దానికి అర్థం కాలేదు- మల్లయ్య తనకు ఎందుకు కనబడలేదో. భర్త లేని సుబ్బమ్మను చూస్తే దానికి జాలి వేసింది. ఆనాటినుండీ అది ప్రతిరోజూ వచ్చి, మల్లయ్య ఇంటి ముందు ఒక బంగారు ఈకను వదిలి వెళ్ళటం మొదలుపెట్టింది.

సుబ్బమ్మ ఆ ఈకల్ని ఒక్కటొక్కటిగా ప్రక్క ఊళ్ళో అమ్ముకొనేది. ఒక్కొక్క బంగారు ఈకకు చాలా డబ్బులు వచ్చేవి. అంతలో బంగారు పక్షి మరిన్ని ఈకలు వదిలి వెళ్ళేది. అలా రానురాను సుబ్బమ్మ ఊళ్ళోకెల్లా ధనవంతురాలైంది.

సంపద పెరిగిన కొద్దీ సుబ్బమ్మకు ఆశకూడా హెచ్చింది. తనకు ఈకలు ఇస్తున్న బంగారు పక్షిని పట్టుకొని దాని ఈకలన్నిటినీ పీక్కోవాలని ఆమె కలలు కనటం మొదలు పెట్టింది. బంగారు పక్షికోసం మాటువేసి, ఆమె ఒకరోజున దాన్ని పట్టుకోబోయింది. చురుకుగా ఉన్న పక్షి, ఆమెనుండి తప్పించుకొని పారిపోయింది. సుబ్బమ్మ దానికోసం తరువాత చాలా రోజులపాటు ఎదురుచూసింది గానీ, అది ఇక తిరిగి అటువైపుకు రాలేదు.

ఆశపోతు సుబ్బమ్మకు మామూలుగా వచ్చే బంగారు ఈక కూడా దొరకకుండా అయ్యింది!





# పిల్లనగ్రోవి



*రచన: U.రేణుక, 8 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

అనగా అనగా ఒక ఊరు. ఆ ఊరి పేరు రంగాపురం. ఆ ఊరి బయట ఒక అందమైన అడవి ఉండేది. రంగాపురంలో రాజు అనే పిల్లవాడు నివసిస్తూ ఉండేవాడు. రాజు వాళ్ళది మధ్యతరగతి కుటుంబం. రాజు, అతని తల్లిదండ్రులు అందరూ సంగీతం అంటే చెవి కోసుకునేవాళ్ళు. రంగాపురానికి ఎలాంటి సంగీత కళాకారులు వచ్చినా, రాజు ఇంట్లోవాళ్లంతా తప్పనిసరిగా పోయి ఆ సంగీతం వినేవాళ్ళు.

ఒకరోజున రాజు బడినుండి వస్తుంటే రోడ్డుమీద జనాలంతా గుమిగూడి సంతోషంగా అరుస్తుండటం కనబడింది. 'ఏమిటా' అని అతను కూడా పోయి చూశాడు. అక్కడ, రాజు అంతే ఉన్న పిల్లవాడొకడు, పిల్లనగ్రోవి ఊదుతూ సంతోషంగా నాట్యం చేస్తున్నాడు.

ఊళ్ళో ఉండే కుర్రవాళ్ళు కొందరు వాడితో కలిసి పాడుతూ, గంతులు వేస్తున్నారు. రాజుకు వాడి సంగీతం చాలా నచ్చింది. వాడు అక్కడే నిలబడి ఆ కార్యక్రమం ముగిసేంతవరకూ చూశాడు. కార్యక్రమం అవ్వగానే జనాలందరూ సంతోషంగా చప్పట్లు కొట్టి వెనుతిరిగారు. కొందరు ఆ పిల్లవాడి మీదికి కొన్ని డబ్బులు విసిరారు. అందరూ వెళ్ళిపోయాక, ఆ పిల్లవాడు వంగి, నేల మీది డబ్బులు ఏరుకోసాగాడు.

అప్పుడు గానీ రాజుకు సమయం గుర్తుకు రాలేదు. ఆ సరికే చీకటి పడవస్తున్నది. రాజు గబుక్కున ఇంటికి పరుగు తీశాడు. ఇంట్లో హోంవర్కు చేస్తున్నాడు గానీ, వాడి మనస్సులో పిల్లన గ్రోవి మ్రోగుతూనే ఉన్నది. ఆరోజు తాను ఎంత గొప్ప సంగీతం విన్నాడో వాడు వాళ్ళ అమ్మా-నాన్నలకు చెప్పి, మురిసిపోయాడు.

మరునాడు ఆదివారం. రాజు వాళ్ళ అమ్మ వాడిని అడవికి పోయి కట్టెపుల్లలు ఏరుకు రమ్మన్నది. రాజుకు అడవి అంటే చాలా ఇష్టం. అడవిలోఒక మూలన అందమైన వాగు ఒకటి ఉన్నది. వాడు కట్టెలు ఏరేందుకు వెళ్ళినప్పుడల్లా ఆ వంకలోకి దిగి, ఈతకొట్టనిదే వెనక్కి రాడు. ఆ రోజున వాడు అడవిలోకి వెళ్ళగానే వంక దగ్గరినుండి చక్కని పిల్లనగ్రోవి పాట వినబడ్డది. రాజు సంతోషంగా ఆ వైపుకు పరుగు తీశాడు.

పిల్లనగ్రోవి పాట బరువుగా ఉన్నది. ఆ దు:ఖపు పాటను వాయిస్తున్నది, రాజు అంతకు ముందు చూసిన పిల్లవాడే. రాజు వాడి దగ్గరికి వెళ్ళి పాటను సాంతం విన్నాక, ఆ పిల్లవాడిని మెచ్చుకొని, వాడి పేరు అడిగాడు. వాడు తన దగ్గరున్న తెల్లకాగితంపైన 'గోవిందు' అని రాసి చూపాడు. రాజు ఏ ప్రశ్నలు వేసినా వాడు జవాబుల్ని రాసి చూపించాడు- గోవిందు మూగవాడు, మరి!

గోవిందుకు అమ్మ నాన్న ఎవ్వరూ లేరనీ, చక్కగా చదువుకునేవాడనీ, అయినా ఆరవ తరగతి మధ్యలో చదువు ఆపేయవలసి వచ్చిందనీ, బంధువులు పట్టించుకోలేదనీ, బ్రతుకు తెరువుకోసం ఇలా పిల్లన గ్రోవిని ఊదుకుంటూ కాలం గడుపుతున్నాడనీ

తెలుసుకున్నాడు రాజు.

కొంచెం సేపు ఆలోచించి, రాజు వాడిని వెంటబెట్టుకొని తన ఇంటికి తీసుకెళ్ళాడు. రాజు తల్లిదండ్రులు గోవిందు పిల్లనగ్రోవి పాటను విని పరవశించి పోయారు. వాడి కష్టాన్ని చూసి చలించిపోయారు. "రాజుతో బాటు గోవిందునీ పెంచుకుందాం. ఏమున్నది?" అనిపించింది వాళ్ళకు.

అదే సంగతిని వాళ్ళు రాజుతోటీ, గోవిందుతోటీ అంటే, గోవిందు సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆనాటినుండి గోవిందు రాజుతోబాటు బడికి వెళ్ళటం మొదలు పెట్టాడు. రాజు గోవిందు దగ్గర పిల్లనగ్రోవి ఊదటం నేర్చుకున్నాడు. ఇద్దరూ చక్కగా చదివి, డాక్టర్లయ్యారు. తమను కలిపిన పిల్లనగ్రోవిని వాళ్ళిద్దరూ ప్రతిరోజూ సాధన చేస్తూనే ఉన్నారు, ఇంకా!

ప్రమాదం

ప్రశ్న: నిండా ప్రయాణికులున్న ఒక విమానం బంగాళా ఖాతంలో పడిపోయింది. ఆ ప్రమాదంలో చనిపోని వాళ్ళని ఎక్కడ దహనం చేస్తారు?

జ. చనిపోని వాళ్లని దహనం చెయ్యరసలు.

కోడి పుంజు గుడ్ల లెక్క

ప్రశ్న: ఒక కోడి పుంజు పది గుడ్లు పెట్టింది. వాటిని పొదిగితే వచ్చే పిల్లలు- ఎన్ని పెట్టలవుతాయి, ఎన్ని పుంజలవుతాయి?

జ. "కోడి పుంజు గుడ్లు పెట్టదు కదా?"




# వింత ప్రపంచం



*రచన: S.త్రివేణి, 9 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

చిన్న పల్లె పేరుకు తగ్గట్లే చిన్న పల్లె. చెట్లు చేమలతో పచ్చగా ఉండే చిన్నపల్లెలో పిల్లలంతా రోజూ సంతోషంగా బడికి వెళ్ళేవాళ్ళు. ఆదివారం వచ్చిందంటే చాలు, అందరూ కలిసి అడవికో, కొండలు ఎక్కేందుకో వెళ్ళేవాళ్ళు. చిన్నపల్లె చుట్టూ ఉన్న అడవిలో జింకలు, కుందేళ్ళు, పాములు, అడవిపందులు, ఎలుగుబంట్లు ఉండేవి. లెక్కలేనన్ని నెమళ్ళు, రకరకాల పక్షులు ఆ అడవిలో నివాసం ఉండేవి.

ఒక ఆదివారంనాడు పిల్లలంతా అడవికి పోతుంటే ఆరేళ్ళ గణేశు 'నేనూ వస్తాను' అని బయలుదేరాడు. మిగిలిన పిల్లలందరూ పెద్దవాళ్ళు- "నువ్వొద్దులే, చిన్నవాడివి" అన్నారు. వాళ్ళట్లా అన్నకొద్దీ గణేశుకు పట్టుదల హెచ్చింది. వాడు ఎంతగా ప్రాధేయపడ్డాడంటే, ఎంత మొండిపట్టు

పట్టాడంటే, చివరికి అందరూ వాడిని కూడా అడవికి రానిచ్చారు.

అప్పటివరకూ గణేశు అడవిలోకి పోయి ఎరుగడు- ఎవరన్నా వాడిని రానిస్తే గద! ఇన్నాళ్ళకు దొరికిన అవకాశాన్ని వాడు సద్వినియోగం చేసుకున్నాడు. కనబడ్డ ప్రతి ఆకునూ, గడ్డినీ, చెట్టునూ, పురుగునూ, పిట్టనూ, జంతువునూ వాడు శ్రద్ధగా గమనిస్తూ తోటి పిల్లల్ని వాటి గురించి ప్రశ్నలు వేస్తూంటే, సమాధానాలు చెప్పలేక, పిల్లలంతా "నువ్వు నోరు మూసుకొని నడువు గణేశూ" అన్నారు.

చూస్తూండగానే మధ్యాహ్నం అయ్యింది. అందరూ ఒక వంక దగ్గర, చెట్లకింద కూర్చుని భోజనాలు చేశారు. కొందరు పిల్లలు ఆడుకున్నారు; కొందరు వంకలో స్నానాలకు దిగారు. గణేశుకు పాపం, కాళ్ళు నొప్పి పుడుతుంటే, ఏమీ చేయకుండా చెట్టుక్రింద కొంచెంసేపు నడుం వాల్చాడు.

ఆ తరువాత గణేశు ఒక్కడే అడవిలో నడుస్తూ పోతుంటే, ఒక గుంత కనబడింది. చిలిపి గణేశు ఆ గుంతపైనుండి దూకుదామనుకుని, దూకాడు. అయితే అవతలివైపు పడటానికి బదులు ఆ గుంతలోనే పడ్డాడు. తీరా చూస్తే, అక్కడినుండి లోపలికి ఒక దారి కనబడింది!

గణేశు ఆ దారివెంబడి నడుస్తూ ఇంకా ఇంకా లోపలికి వెళ్ళిపోయాడు. కొంత దూరం వరకూ పెద్దగా చెట్లూ మొక్కలూ కనబడలేదు గానీ, ఆపైన తను ఏనాడూ చూడని వింత పువ్వులతో, చెట్లతో ఒక దట్టమైన అడవి మొదలైంది.

చిన్నపల్లెలో జంతువులన్నీ ఆహారం వెతుక్కొని జీవించేవి. కానీఇక్కడి జంతువుల పని చాలా భిన్నంగా ఉంది- అవి మనుషుల్లాగా పంటల్నీ, చెట్లనీ, అడవినీ పెంచుకుంటున్నాయి!

అంతలో అక్కడ ఉన్న కుందేలు ఒకటి గణేశును చూసి, 'అరే, ఇదేదో కొత్త జంతువు ఇక్కడికి వచ్చినట్లుందే' అనుకున్నది. వెంటనే అది గణేశు దగ్గరికి వచ్చి ఎంతో ప్రేమగా పలకరించింది కూడా. కానీ గణేశు ఎంత ప్రయత్నించినా అది ఏమంటున్నదోఅర్థం

కాలేదు- వాడికి కుందేలు భాష రాదు కద!

అక్కడ చేరిన ఉడతలూ, కప్పలూ, గువ్వలూ, అన్నీ తమలో తాము ఏవేవో మాట్లాడుకున్నై, కానీ గణేశుకు ఒక్క ముక్కా అర్థం కాలేదు. చివరికి కుందేలు వాడిని చేయిపట్టుకొని నడిపించుకు వెళితే, మర్యాద కొద్దీ వాడు దాని వెంట నడిచాడు.




కుందేలు వాడిని తన ఇంటికి తీసుకెళ్ళింది. క్యారట్లు, ముల్లంగి గడ్డలు స్తంభాలుగా చేసుకొని కట్టుకున్న ఆ యింటి కప్పుకోసం క్యారట్ మొక్క ఆకుల్నే వాడుకున్నది కుందేలు. కుందేలు భర్త, కుందేలు కొడుకూ గణేశును ఆప్యాయంగా పలకరించారు. నోట మాట రాని ఈ మూగ జీవి అంటే వాటన్నిటికీ చాలా జాలి కలిగింది.

కొంతకాలానికి గణేశు కుందేళ్లకు మంచి మిత్రుడయ్యాడు. వాటి భాషకూడా వాడికి ఇప్పుడిప్పుడే అర్థం అవుతున్నది. కుందేళ్ళు వాడికి తమ లోకాన్ని కొద్ది కొద్దిగా పరిచయం చేశాయి- అన్నీ కలిసి ఒకరోజున పట్టణానికి వెళ్ళాయి. అక్కడి దృశ్యం గణేశును ఆశ్చర్య చకితుణ్ని చేసింది: పట్నంలో ఎలుగుబంటి స్కూటర్ నడుపుతున్నది- సింహం కారును, పులి పెద్ద లారీని నడుపుతున్నై. నక్కలు, తోడేళ్ళు, అడవిపందులు దుకాణాలు పెట్టుకుని కూర్చున్నై. చీమలు రోడ్లను శుభ్రం చేస్తున్నై. సీతాకోక చిలుకలు, కందిరీగలు హడావిడిగా అటూ ఇటూ ఎగురుతూ ట్రాఫిక్ ను నియంత్రిస్తున్నాయి.

కుందేళ్ళు గణేశుకి వాటి లోకంలో ప్రసిద్ధి చెందిన ప్రాంతాలను కూడా చూపించాయి. అక్కడి భవనాల్ని చూసి గణేశు చాలా ఆశ్చర్యపోయాడు. అవన్నీ గడ్డితోటీ, చెట్లతోటీ తయారైనాయని తెలుసుకొని

గణేశుకు చాలా సంతోషం కలిగింది.

అలా ఇంకొన్ని రోజులు గడిచేసరికి గణేశుకు కుందేళ్ళ భాషపూర్తిగా వచ్చేసింది. వాడిప్పుడు వాటితో చక్కగా మాట్లాడుతున్నాడు. కుందేళ్ళు వాడిని కూడా తమ పిల్లలతోబాటు బడికి పంపాయి. బడిలో వాడు కుందేళ్ళ అయ్యవార్లు చెప్పే పాఠాల్ని శ్రద్ధగా చదవటం మొదలుపెట్టాడు. ఇప్పుడు వాడు పూర్తిగా ఆ లోకపు ప్రాణి అయిపోయాడు.




ఆ సమయంలో వాడికో కల వచ్చింది. కలలో వాళ్ళ అమ్మ, నాన్న, బడి, బడిలోవాడి స్నేహితులు అందరూ వచ్చారు. అందరూ వాడికోసంవెతుక్కుంటూ, "గణేశూ, గణేశూ!" అని కేకలు పెడుతున్నారట. వాళ్ళని తలుచుకునేసరికి గణేశుకు ఏడుపొచ్చింది. 'తను ఇన్నాళ్ళుగా వాళ్ళని గురించి పట్టించుకోలేదే' అని వాడికి బాధ వేసింది.

అంతలో ఎవరో వచ్చి వాడిని తట్టి లేపారు. ఎవరా అని లేచి చూస్తే- వాడితోబాటు అడవికి వచ్చినపిల్లలు!

గణేశు గబుక్కున చుట్టూ కలియ చూశాడు. వంక, అడవి, చెట్లు- అన్నీఅంతకు ముందు ఎట్లా ఉన్నాయో అట్లానే ఉన్నాయి. అయితే అవన్నీ గణేశు కు ఇప్పుడు ప్రత్యేకంగాను, క్రొత్తగాను కనబడుతున్నాయి. చెట్లచాటునుండి తనవైపే చూస్తున్న ఉడతలు తనను ఆ వింతలోకం నుండి వెనక్కి తీసుకొచ్చిన జంతువుల్లాగా అనిపించాయి. వంకలో నీళ్ళు సాయంత్రపుటెండలో మెరుస్తూ, గలగలా శబ్దం చేసుకుంటూ సాగిపోతున్నాయి. వెనక్కి వస్తుండగా, దారిలో ఎదురైన ఒక కుందేలుతో గణేశు మాట్లాడేందుకు ప్రయత్నించాడు గానీ, అది ఊరికే ఓసారి వెనక్కి తిరిగిచూసి, తుప్పల్లోకి పరుగుతీసింది!



# దివాను ఎంపిక

*సేకరణ: సుప్రజ, 6 వ తరగతి, సరస్వతీ శిశు మందిర్. సత్తెనపల్లి, గుంటూరు జిల్లా.*

మహేంద్రపురం జమీందారీలో దివాను ముసలివాడయ్యాడు. ఆయన విశ్రాంతి కోరటంతో కొత్త దివాను అవసరం ఏర్పడింది. దివాను పదవికి అర్హులైన వారందరూ దరఖాస్తులు పంపమని జమీందారు గారు చాటింపు వేయించారు. చాలా మంది చదువుకున్నవాళ్ళు దరఖాస్తు చేసుకున్నారు. వారందరికీ పరీక్ష పెట్టగా అన్నింటా సమానంగా ఉన్న అభ్యర్థులు ముగ్గురు లెక్కతేలారు. కానీ పదవి ఉన్నది ఒకటే కదా! దిక్కుతోచని జమీందారుగారు పాత దివానునే పిలిపించి, కొత్తదివాను ఎంపిక బాధ్యతను ఆయనకు అప్పగించారు.

పాత దివాను ఆ ముగ్గురినీ పిలువనంపి, ఆ ఊరి రచ్చబండ దగ్గరకు పోయి రమ్మన్నాడు. ఇద్దరు అభ్యర్థులు వెంటనే బయలుదేరి వెళ్ళారు; కానీ ఒకడు మాత్రం అక్కడే కూర్చుని ఉండిపోయాడు.

"ఏం, నువ్వెందుకు వెళ్ళలేదు?" అని అడిగారు జమీందారు గారు. "అసలు తమరు

మమ్మల్ని అక్కడికి ఎందుకు వెళ్ళమన్నారు, అని ఆలోచిస్తున్నాను ప్రభూ!" అన్నాడు వాడు.



కొంచెం సేపు అయ్యిందో లేదో, వెళ్ళినవాళ్ళలో ఒకడు తిరిగి వచ్చాడు వగర్చుకుంటూ. "నీతోపాటు వెళ్ళినవాడు ఏడి?" అనడిగారు జమీందారుగారు. "అతని సంగతి నాకు తెలీదు- పోయి రమ్మన్నారు గనుక పరుగు పరుగున పోయి వచ్చాను" అన్నాడు వాడు.

ఇంకో పావుగంట గడిచాక గానీ మూడోవాడు రాలేదు. "ఏమి, ఇంత ఆలస్యం ఎందుకైంది?" అని అడిగాడు పాత దివాను. "తమరు పోయి రమ్మని ఊరికే చెప్పరు కదా, అందుకని, పోయి ఆ పరిసరాలను గమనించి వచ్చాను. రావిచెట్టు, మఱ్ఱిచెట్టు కలిసి పెరిగిన చోట అరుగు ఏర్పరచి రచ్చబండ కట్టించారు. కానీ దాని నిర్వహణ సరిగ్గా లేకపోవటంతో చెట్టు మీద చేరిన పక్షుల రెట్టలతో అదంతా చాలా అపరిశుభ్రంగా అయ్యింది. పనీపాట లేనివాళ్లంతా అక్కడ చేరి దారిన పోయే మామూలు వాళ్లకు ఇబ్బంది కలిగిస్తున్నారు. అక్కడంతా బాగుచేసి, రచ్చబండను ఊరి పెద్దల చర్చలకు అనువైన ప్రదేశంగా మార్చాల్సి ఉంది" అని జవాబిచ్చాడతను వినయంగా.

పాతదివాను నవ్వుతూ జమీందారు వైపు చూశాడు. జమీందారు కూడా నవ్వి, మూడవ వాడినే కొత్త దివానుగా నియమించాడు. మిగిలిన ఇద్దరూ నిరాశ చెందటం చూసిన పాతదివాను వాళ్ళను అనునయిస్తూ "ఏదైనా పనిని అప్పగించినప్పుడు ఆ పనిని అసలు మొదలు పెట్టకనే, 'అది ఎందుకు చెప్పారా' అని కారణాలు వెతకబోవటం తెలివైన పని కాదు- శుద్ధ అవివేకం. అలానే సమస్య ఏమిటో గుర్తించకుండా గుడ్డిగా ఎవరో చెప్పారు కాబట్టి ఏదోముగించుకొని రావాలనుకోవటమూ సరైనది కాదు. ఈ విషయాన్ని మీరిద్దరూ గుర్తించారనుకుంటాను" అన్నాడు.




# ముగ్గురు మూర్ఖులు

*మూల రచన: లియో టాల్‌స్టాయ్.*

*పునశ్చరణ: మహాత్మా ఆనంద్‌స్వామి*

*తెలుగు అనుసరణ: నారాయణ*

ఒక క్రిస్టియన్ ఫాదర్ గారు దేశదేశాలు పర్యటించి దేవుని వాక్యాన్ని అందరికీ చేరవేస్తుండేవారు. "బైబిల్ లో చెప్పిన ఈ ప్రార్థనను మీరూ నేర్చుకోండి. ఈ విధంగా దేవుడిని ప్రార్థించాలి. మీకు తప్పక విముక్తి లభిస్తుంది" అని ఆయన గంభీరంగా ప్రవచిస్తే, ప్రజలు మంత్రముగ్ధులై ఆయన చెప్పినట్లు చేసేవాళ్ళు.

ఆ రోజుల్లో ఖండాల్ని దాటేందుకు పడవ ప్రయాణం తప్ప వేరే మార్గం లేదు. పాస్టరుగారు తన అనుచరులతో కలిసి ఓడలమీద దేశదేశాలూ తిరుగుతూ ఉండేవారు.

ఒకసారి, ఆయన అలా సముద్రయానం చేస్తుంటే, దూరంగా ఒక దీవి కనబడ్డది.

ఉత్సాహవంతుడైన మన పాస్టరుగారికి "అక్కడ మనుషులు ఎవరైనా ఉంటారేమో చూద్దాం" అనిపించింది. "ఎవరైనా ఉంటే వాళ్ళకూ దైవ ప్రార్థన నేర్పించవచ్చు కదా, అలా మరికొంతమందికి ముక్తిమార్గాన్ని చూపినట్లౌతుంది" అని, ఆయన ఓడను అటువైపుకు తిప్పమన్నాడు.

ఆ దీవి నిర్జనంగా ఉంది. పాస్టరుగారు తన అనుచరులతో కలిసి దీవిలో కొంతసేపు తిరిగి చూశారు. మానవమాత్రులు ఉంటున్న జాడలే లేవు అక్కడ. పాస్టరుగారు ఇక వెనక్కి తిరుగుదామనుకున్నంతలో ముగ్గురు ముసలివాళ్ళు దూరంనుండి ఆయనవైపే వస్తూ కనబడ్డారు. వాళ్ళ జుట్టు పొడుగ్గా ఉండి, తెల్లగా మెరిసిపోతున్నది. తెల్లటి గడ్డాలు- బాగా పెరిగి ఉన్నై, వాళ్లకు. వాళ్ళు తమ శరీరాల్ని చెట్ల ఆకులతో కప్పుకొని ఉన్నారు. వాళ్ళ దగ్గర ఇంకేలాంటి వస్తువులూ లేవు.

పాస్టరుగారు ఆగి, వాళ్ళకోసం చూశారు. వాళ్ళు దగ్గరికి రాగానే అయన వాళ్లను "ఈ దీవిమీద ఏదైనా గ్రామంగాని, పట్టణంగాని ఉన్నదా?" అని అడిగాడు.

ఒక ముసలాయన వినయంగా జవాబిచ్చాడు- "లేదండీ, ఈ దీవిమీద కేవలం మేం ముగ్గురమే నివసిస్తున్నాం. ఇంకెవ్వరూ లేరు ఇక్కడ. మేం పండ్లు తిని, నీళ్ళు తాగుతుంటాం. ఎవరైనా మీలాంటి యాత్రీకులు అనుకోకుండా ఇటువైపుకు వస్తే మేంవాళ్లకూ ఇవే ఇస్తుంటాం" అని.

"అయ్యో!" జాలి పడ్డారు పాస్టరుగారు. "ఇదా, మీరు చేస్తున్నది? ఎంత దురదృష్టవంతులు, మీరు? రోజంతా ఖాళీగా ఇలా మీ సమయాన్నంతా వృధా చేసుకుంటున్నారు, పాపం. మిమ్మల్ని సృష్టించిన భగవంతుడు ఒకడున్నాడని కూడా గుర్తించలేని మీ జన్మ వృధా కాదా?" అని.

"అలాంటిదేమీ లేదు. మేం ఆయన్ని ఎప్పుడూ గుర్తు చేసుకుంటూనే ఉంటాం. అది తప్ప మాకు వేరే పనేదీ లేదు" అన్నాడు రెండవ ముసలాయన.

"అవునా, ఎలా గుర్తు చేసుకుంటుంటారు, చెప్పండి?" అడిగారు పాస్టరుగారు.

"రోజూ మేం ముగ్గురం కలిసి కూర్చుంటాం. ఆపైన ఆకాశం వైపుకు చూస్తూ, చేతులు పైకెత్తి- 'మేం ముగ్గురం, మీరూ ముగ్గురే. మమ్మల్ని కాపాడండి' అంటాం." చెప్పాడు మూడవ ముసలాయన.

ఫాదరుగారు నవ్వారు. "ఎంత పిచ్చి ప్రార్థన, ఇది?! మీరు ముగ్గురూ ముసలివాళ్లయ్యారు. కాటికి కాళ్ళు చాపే వయసు మీది. ఇంత గొప్ప జీవితాన్ని ఇలా వ్యర్థంచేసుకున్నారంటే, మీమీద నాకు జాలి కల్గుతున్నది. రండి- కూర్చోండి ఇక్కడ. అసలు ప్రార్థన ఎట్లా చేయాలో మీకు నేను నేర్పుతాను" అన్నారు.

ముగ్గురూ కూర్చున్నాక, ఆయన వాళ్ళకు సరైన పద్ధతిలో ప్రార్థన ఎలా చేయాలో నేర్పించారు. చదువురాని ఆ మొద్దులకు ప్రార్థన నేర్పించటం కొంచెం కష్టమే అయ్యింది. ఎన్నిసార్లు చెప్పినా వాళ్ళు ఆ పదాల్ని మర్చిపోతూ వచ్చారు. అయినా పాస్టరుగారు విసుక్కోకుండా వాళ్లకు మళ్ళీ మళ్ళీ నేర్పారు. వాళ్ళ బాగుకోసం ఆ మాత్రం శ్రమపడితే పరవాలేదనుకున్నారు ఆయన. చివరికి, వాళ్ళకు ప్రార్థన చేసుకోవటం వచ్చేసిందనిపించాక, పాస్టరుగారు సంతృప్తిగా ఓడనెక్కి, తనప్రయాణంకొనసాగించారు.

ఓడ ఆగకుండా పోతున్నది. మరునాటి మధ్యాహ్నంవేళ, పడవను నడిపేవాడొకడికి, వెనుక వైపున- దూరంగా సముద్రంమీద ఒక ఆకారం కనబడ్డది. "అదేమై ఉంటుంది?" అని వాడు అందరినీ అడిగాడు. దుర్భిణిలోంచి చూసిన పాస్టరుకు అక్కడ ఒకటికాదు- మూడు మానవాకారాలు కనబడ్డాయి. "అవేమిటి?" అని అందరూ ఆశ్చర్యపోతూనే ప్రయాణం కొనసాగించారు.

అయితే కొద్ది సేపటికి వాటి రహస్యం తేటతెల్లమైంది. వాళ్ళు మనుషులే! పాస్టరుగారు క్రితంరోజున ప్రార్థన నేర్పిన ముగ్గురు మూర్ఖులే వాళ్ళు. నట్టనడి సముద్రంలో, నీళ్లమీద, ఓడకంటే వేగంగా పరుగెత్తుకొని వస్తున్నారు వాళ్ళు. పాస్టరుగారు ఓడని నిలబెట్టారు. "ఈ ముసలివాళ్ళు ముగ్గురూసముద్రంలో మునిగిపోలేదు- ఎందుకు?" అని ఆయనకు చాలా ఆశ్చర్యం

వేసింది. అంతలో వాళ్ళు ఓడను చేరుకొని అందరికీ నమస్కరించారు.

"ఫాదర్, మమ్మల్ని మీరే కాపాడాలి. మేం ముగ్గురం చదువురాని వాళ్ళం, పల్లె మనుషులం. నిన్న మీరు అంత శ్రమకోర్చి నేర్పిన ప్రార్థన, ఈ రోజు ఎంత గుర్తు చేసుకుందామన్నా గుర్తురాలేదు మాకు. మీరు అన్యధా భావించకండి, నిన్నటి ప్రార్థననే మళ్ళీ ఓసారి నేర్పించాలి మాకు. ఈసారి తప్పకుండా గుర్తుంచుకుంటాం" అన్నారు వాళ్ళు.

ఇంకా ఆశ్చర్యంనుండి తేరుకోని పాస్టరు గారు "కానీ, ముందు ఈ సంగతి చెప్పండి నాకు- మీరు నీళ్ల'మీద' ఎట్లా పరుగెత్త-గల్గుతున్నారు?" అని అడిగారు.

"అదేమంత కష్టం కాలేదు" చెప్పాడు వాళ్లలోఒకడు- "మేం దేవుడితో చెప్పాం-'దేవుడా, మాకు పడవ లేదు. ప్రార్థన నేర్చుకోవటంకోసం మేం పరుగెత్తుతాం' అని. ఆ తరువాత మేం పరుగు మొదలుపెట్టాం" అన్నాడు.

అప్పటివరకూ ఆ ముగ్గురు అనాగరికుల్నీ చిన్నచూపు చూసిన పాస్టరుగారి కళ్ళు తెరుచుకున్నాయి. ఆయన గౌరవంగా చేతులు జోడించి, "పవిత్ర మూర్తులారా! మీరు వెంటనే వెనక్కి పోండి. మీ పాత ప్రార్థనను మీరు నిశ్చింతగా కొనసాగించుకోండి. దాన్ని అస్సలు మార్చనక్కర్లేదు. దేవుడికి మీ భావనలు అర్థం అవుతున్నాయి- ఆయనకు మాటలతో అసలు పనే లేదు" అన్నాడు.

భగవంతునికి మన మాటలతోటీ పనిలేదు- అంత:కరణం ఎలా ఉన్నదనేదే ముఖ్యం.





# నాగమాత కథ



*మూలం: ఎ.కె.రామానుజన్,*

*తెలుగు అనుసరణ: నారాయణ*

అనగా అనగా గుజరాత్‌లో ఒక ధనవంతుడు ఉండేవాడు. ఆయనకు ఏడుగురు కొడుకులు, కోడళ్ళు. వాళ్ళల్లో అందరికంటే చిన్న కోడలుపేరు ఉమ. ఆమెకు, పాపం, చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోయారు. ఆ రోజుల్లో అలాంటి కోడళ్లను అత్తింటివాళ్ళు చాలా కష్టపెట్టేవాళ్ళు. వాళ్ళు 'దురదృష్ట జాతకులు' అని అందరూ చిన్నచూపు చూసేవాళ్ళు. ముఖ్యంగా ఆమె అత్త కోకిలాబెన్- ఉమని చాలా ఈసడించుకునేది. ఇంట్లోవాళ్లంతా ఆమెని "ఎవరూ లేని పిల్ల" అని పిలిచి ఏడిపిస్తుండేవాళ్ళు. ఆమె భర్త మాత్రం ఆమెపట్ల ప్రేమగా ఉండేవాడు. అతనొక్కడే ఆయింట్లో ఆమెకు స్నేహితుడు. కానీ ఇంట్లో అతనిమాట నెగ్గేది కాదు- ఎవ్వరూ అతన్ని పట్టించుకునేవాళ్లు కాదు.

పెళ్ళైన కొన్ని నెలలకే ఉమ గర్భవతి అయ్యింది, కానీ భర్త తప్ప, ఆ యింట్లో ఎవ్వరూ అందుకు సంతోషించలేదు. అంతలోనే పెద్దల పండుగ వచ్చింది. ఆరోజున గృహస్తులంతా వాళ్ళ పూర్వీకులకోసం పిండివంటలు, స్వీట్లు చేసి అర్పించటం రివాజు. అందుకని ఇంట్లో పాయసం వండారు. ఉమకు పాయసం చాలా ఇష్టం. దానికి తోడు గర్భవతికూడా కావటంతో, ఆమె పాయసం తినాలని చాలా ఆశపడింది. కానీ ఇంట్లోవాళ్ళు ఆమెకు ఒక్క చుక్క పాయసంకూడా ఇవ్వలేదు. అందరూ తిని, గిన్నెలు ఖాళీ చేశాక, వాళ్లు గిన్నెలు ఉమకు ఇచ్చేసి, శుభ్రంగా తోమిపెట్టే పనిని అప్పజెప్పారు!

అయినా పాపం, ఆమె ఏమీ అనలేదు; పాయసం వండిన గిన్నెను తీసుకెళ్ళి, దాని లోపల అంటుకొని ఉన్న మాడు చెక్కల్ని అన్నిటినీ గీకి, కనీసం ఆ ముక్కలైనా తిందామనుకున్నది. అయితే ఆమె అప్పటికి ఇంకా స్నానం చేయలేదు- అందుకని, గీకిన పాయసం మాడుచెక్కల్ని ఆమె ఒక బట్టలో మూటగట్టి అక్కడపెట్టుకొని, స్నానానికి పోయింది.

కానీ ఆమె స్నానం చేసి తిరిగివచ్చి చూసేసరికి, ఆ మూట ఖాళీగా ఉంది! ఉమకు చాలా దు:ఖం వేసింది. అయినా ఆమె "పోనీలే, నా పాయసం పోయింది. ఎవరో ఎత్తుకుపోయినట్లున్నారు. నాకంటే వాళ్ళకే ఎక్కువ ఆకలి అయ్యిందేమోలే. నేనే వాళ్లకి కృతజ్ఞతలు చెప్పాలి- ఎందుకంటే ఆకలిగా ఉన్నవాళ్ళకు భోజనం పెడితే పుణ్యం వస్తుంది గద!" అనుకున్నది.

అంతలో, ఎక్కడినుండి ఊడిపడిందో, ఏమో ఒక పే..ద్ద పాము ఆమె ముందుకొచ్చి నిలబడింది. భయంతో ఉమ వణికిపోయింది. అంతలో ఆ పాము ఉమతోమనిషి భాషలో ఇలా అన్నది: "అమ్మాయీ! భయపడకు. నా పేరు నాగరాణి. నీ పాయసం తిన్నది నేనే!

నేను నీ పాయసం మొత్తాన్నీ తినేసినా, నువ్వు నన్ను ఏమీ తిట్టుకోలేదు. అందుకని నువ్వంటే నాకు చాలా ఇష్టం అవుతున్నది. నీకు ఏ సాయం కావాలంటే ఆ సాయం

చేద్దామనిపిస్తున్నది. చెప్పు, నువ్వెందుకు అంత బాధగా ఉన్నావు?" అని అడిగింది.

అప్పుడు ఉమ తన గోడు అంతా నాగరాణికి చెప్పుకున్నది. బంధువులు ఎవ్వరూ లేరని తనని అత్తింటివాళ్ళు ఎలా కష్టపెడుతున్నదీ వివరించింది. అంతావిని నాగరాణి "నీకు ఎవరూ లేరని అనుకోకు. నేను మీ అమ్మనే అనుకో. ఇక మా వాళ్లం అందరం నీకు బంధువులమే! నీ అవసరాలన్నీ ఇకపైన మేమే తీరుస్తాం" అన్నది.

తర్వాత కొన్ని నెలలకు ఉమకు శ్రీమంతం చేయాల్సిన సమయం వచ్చింది. అత్తింటివాళ్ళు, అయిష్టంగానే శ్రీమంతానికి తేదీ నిర్ణయించారు. "నా దూరపు బంధువు ఒకావిడ ఈ మధ్యే నన్ను చూసింది- ఆమె ద్వారా నాకు ఇంకా కొద్దిమంది బంధువులు ఉన్నట్లు తెల్సింది- ఆహ్వానాలు పంపితే, వాళ్ళుకూడా వస్తారు" అన్నది ఉమ అత్తతో.

"అయ్యో, వస్తారంటే పిలువకేమి, తల్లీ? అయినా వాళ్ళంతా నీ ఊహల్లోనే తప్ప, వాస్తవంలో ఉండరని నా అనుమానం" అన్నది కోకిలాబెన్, ఈసడించుకుంటూ.



అయితే శ్రీమంతం రోజున, ఆశ్చర్యం! ఉమ తరపు బంధువులు చాలామంది- కార్లలోనూ, బస్సుల్లోను, ఆటోల్లోను వచ్చి వాలారు. ధగ ధగ మెరిసే ఉంగరాలు, నగలు, పట్టు వస్త్రాలతో వాళ్లంతా ఇంట్లో తిరుగుతూ ఆప్యాయంగా గలగలా మాట్లాడుతుంటే అత్తింటివాళ్ళు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు. వాళ్లంతా ఉమకోసమూ, ఇంట్లో వాళ్ళందరికోసమూ అమూల్యమైన బహుమతుల్ని తెచ్చి ఇస్తుంటే అత్తగారికి "ఇదంతా కలా, నిజమా" అనిపించింది. ఆమె వాళ్లందరినీ ఎంతో గౌరవించి, గొప్ప విందు చేసి సత్కరించింది.

ఆ తరువాత నాగమాత ఉమను తనవెంట నాగలోకానికి తీసుకెళ్ళింది. ఉమను కాలు క్రింద పెట్టనివ్వకుండా జాగ్రత్తగా చూసుకున్నది. అక్కడ ఉమకు పండంటి కొడుకు పుట్టాడు. బంగారంలాంటి కొడుకును ఎత్తుకొని, భాగ్యవంతులైన బంధువర్గాన్ని వెంటబెట్టుకొని అత్తవారింటికి తిరిగి వచ్చిన ఉమకు ఇప్పుడు అత్తింటివారు బ్రహ్మరథం పట్టారు! అందరూ ఉమను ఎంతో గౌరవించసాగారు- సంపద ఏమేం చేస్తుందో చూడండి!

**ఊహించు!**

ప్రశ్న: ఒకాయన భోరున కురుస్తున్న వర్షంలో ముద్దయిపోయాడు. ఆయన శరీరం అంతా తడిసింది గానీ తలమీద ఒక్క వెంట్రుక కూడా తడవలేదు- ఎందుకు?

జవాబు: "ఆయనది బోడిగుండు."

**పురుగు!**

రోగి: డాక్టరుగారూ, నేను గొంగళిపురుగునైపోయి, ఆకులమీద పాకుతున్నట్లు అనిపిస్తోందండీ.

డాక్టరు: అయితే పరవాలేదమ్మా, త్వరలో మీరు ఎలాగూ సీతాకోకచిలుకలా మారిపోయి, ఎగురుతారు కదా?




# పిసినారి పాట్లు

*పంజాబ్ జానపద కథ*

*మూలం: పర్తాప్ అగర్వాల్*

*తెలుగు అనుసరణ: నారాయణ*



పంజాబ్ రాష్ట్రంలో ఒక చిన్న పట్టణం బంగ. బంగలో నివసించే ప్రతి ఒక్కరికీ తెలుసు-మంగళ్దాసు ఎంత పిసినిగొట్టో. ఒకసారి మంగళ్దాసు దుకాణంనుండి ఇంటికి తిరిగివచ్చేసరికి భార్య పుచ్చకాయ (కలింగరి కాయ)ముక్కలు తరిగి పెట్టింది. అయితే ఇంట్లో చూస్తే, దాని పై చెక్కు కనబడలేదు మంగళ్దాసుకు. దాంతో అతను ఎంత రగడ చేశాడంటే, చివరికి అతని భార్య విసిగిపోయి, తను బయట చెత్తకుప్పలో పారేసిన పుచ్చకాయ చెక్కుల్ని ఏరుకొచ్చి, వాటిని కడిగి, కూర చేసి పెట్టింది!

ఒకసారి ఆ మంగళ్దాసు పనిమీద నగరానికి వెళ్లాల్సి వచ్చింది. బస్సు ఛార్జీలు

మిగుల్చుకునేందుకుగాను అతను నగరం వరకూ నడిచి పోయాడు. మధ్యలో నదిని దాటేందుకు, మరబోటులో అయితే ఎక్కువ అడుగుతారని, తాతల కాలంనాటి పాత డింగీనొకదాన్ని ఎక్కాడు.

వెళ్లటం బాగానే వెళ్ళాడు గాని, వెనక్కి వచ్చేటప్పుడు, కాలం చెల్లిన ఆ పడవకు చిల్లి పడింది. ఆ సమయానికి పడవ నది మధ్యలో ఉన్నది. దగ్గర్లో నేల అన్నది లేదు. రంధ్రంగుండా నీళ్లు బలంగా లోపలికి వస్తున్నాయి- చూస్తూండగానే డింగీ నీళ్లలో మునిగిపోనారంభించింది. మంగళ్దాసు ప్రాణాలు పోయినంత పనైంది- ఎందుకంటే అతనికి ఈత రాదు మరి. ఇక చేసేదేమీ లేక, అతను తన కుల దైవాన్ని ప్రార్థించటం మొదలు పెట్టాడు- "స్వామీ, నన్ను ఈ కష్టం నుండి గట్టెక్కిస్తే, నీ సంతృప్తి కోసం నేను సంతర్పణ చేసి, వెయ్యిమంది బ్రాహ్మణులకు భోజనం పెడతాను" అని గొణగసాగాడు, ప్రాణాలు గుప్పిట్లోపెట్టుకొని.

పడవ మునిగిపోయింది. మంగళ్దాసు కూడా మునిగేవాడే- కానీ ఆ సమయంలో ఎక్కడినుండి వచ్చిందో మరి- ఒక పెద్ద కొయ్య దుంగ అతని పక్కకే వచ్చి ఆగింది. మంగళ్దాసు గబుక్కున ఆ దుంగను పట్టుకున్నాడు- మెల్లగా దాని పైకి ఎక్కి కూర్చున్నాడు- భద్రంగా సర్దుకొని, చతికిలబడి కూర్చున్నాడు. దాంతో భయం కొద్దిగా తగ్గింది. ఇప్పుడు అతనికి ఊపిరి పీల్చుకునేందుకు కొంచెం సమయంకూడా దొరికింది. దాంతోటే ఆలోచనా మొదలైంది- "అయ్యో, వెయ్యి మందికి భోజనం పెడతానని నేను ఎట్లా అనగల్గాను? వెయ్యి మంది అంటే మాటలు కాదే! అయినా ఆ దేవదేవుడికి ఈ లెక్క ఏమంత పెద్దది గనక? నేను ఐదు వందల మందికి భోజనం పెట్టినా ఆయనకు సంతోషమే అవుతుందిలే, పరవాలేదు" అనుకున్నాడు.

అలా పోయి, పోయి, దుంగ ఒక పల్లపు ప్రాంతాన్ని చేరుకొని ఆగింది. మంగళ్దాసు కాళ్లకు ఒక పెద్ద బండరాయి తగిలింది. అతను దాన్ని కొంత తడిమి, చివరికి దాని పైకెక్కి నిలబడ్డాడు. దగ్గర్లోనే ఒడ్డు కనిపిస్తున్నది- ఇక

ప్రమాదం తప్పినట్లే. అతని ఆలోచనలు తను భోజనం పెట్టాల్సిన ఐదువందల మంది బ్రాహ్మణుల వైపుకు మళ్ళాయి. "ఐదు వందలమందికి భోజనం పెట్టనవసరంలేదు- ఐదు వందలలో ఏమున్నది? వందమందికి పెట్టినా మా ప్రభువుకు సంతోషమే. ఆయన నిత్య సంతోషి కదా, ఏమీ పరవాలేదు." అనుకున్నాడు.

బండమీద కొంచెం సేద తీరిన తరువాత అతను మళ్ళీ దుంగపైకి ఎక్కి ప్రయాణం సాగించాడు ధైర్యంగా. అది త్వరలో ఒడ్డున ఉన్న ఇసుకను తాకింది. ప్రమాదం పూర్తిగా తప్పిపోయినట్లే. ఇక మంగళ్దాసు సంతృప్తిగా నిట్టూర్చి, ఇంకా బాగా అనిపించటంకోసం, తను భోజనం పెట్టాల్సిన బ్రాహ్మణుల సంఖ్యను ఒకటికి తగ్గించేసుకున్నాడు. " 'భగవానుడు 'పత్రం, పుష్పం, ఫలం, నీళ్ళు'-ఇవి చాలు నాకు' అనలేదా, దానిదేమున్నది?" అనుకున్నాడు ఇప్పుడు.

అయినా, భద్రంగా ఇల్లు చేరుకున్నాక ఆలోచిస్తే అతనికి అదీ భారంగానే అనిపించసాగింది- ఏమంటే "ఈ బ్రాహ్మణులు తిండి బాగా తింటారు- పెద్ద పెద్ద బొజ్జల నిండా" అని బాధ. అందుకని, అతను బాగా ఆలోచించి, ఒక బక్కపలచటి బ్రాహ్మణుడు 'రిఖీరాం' ను ఎంపిక చేసుకున్నాడు. రిఖీరాంకు కడుపు సౌఖ్యం లేదని ఊరందరికీ తెల్సు. అందుకని మంగళ్దాసు వాళ్ళింటికి పోయి, అతన్ని మరుసటి రోజు ఉదయం తన ఇంట్లో భోజనానికి రమ్మని చెప్పి చక్కా వచ్చాడు.



"అయితే, బ్రాహ్మణుడు తనని చూశాడంటే ఏదో ఒక పేరు చెప్పి బాగా దక్షిణ వసూలు చేస్తాడు- అదే, తను గనక ఇంట్లో లేకపోతే ఊరికే నోరుమూసుకొని, భోజనం చేసి

పోతాడు- అందుకని, మంగళ్దాసు మరునాడు తెల్లవారకనే భార్యకు జాగ్రత్తలు చెప్పి, ఆ బ్రాహ్మణుడికి దొరక్కుండా 'ముఖ్యమైన పని' ఏదోపెట్టుకొని, వేరే ఊరికి వెళ్ళిపోయాడు.

కానీ బ్రాహ్మణుడు రిఖీరాం చాలా తెలివైనవాడు. అతనికి మంగళ్దాసు నైజం బాగా తెలుసు. వీలైతే మంగళ్దాసు తనకు దక్షిణ కూడా ఇవ్వకుండా ఎగనామం పెట్టేయగలడు! అందుకని, తెల్లవారగానే బయలుదేరి మంగళ్దాసు ఇంటికి వెళ్ళాడు రిఖీరాం. అయినా ఆ సరికే మంగళ్దాసు వేరే ఊరికి వెళ్ళిపోయాడు! 'ఇదీ మన మంచికే' అనుకున్న రిఖీరాం మంగళ్దాసు భార్య 'పారో'తో- "తల్లీ, నేను ఒక్కడినే భోజనానికి వస్తున్నానని వంట పరిమితంగా చేస్తావేమోనని, ముందుగా హెచ్చరించి పోదామని వచ్చాను- ఈ పూజ 'సంతర్పణ'-కనుక కనీసం పది మందికి సరిపడా భోజనం తయారు చేయవలసి ఉంటుంది. లేకపోతే ప్రయోజనం సిద్ధించద్దూ?!" అన్నాడు. ఆమె ఇక ఏమీ అనలేక, సర్దుకొని, "అయ్యో! ఆ మాత్రం నాకు తెలీదా, అలాగే చేస్తానులెండి!" అని చెప్పింది.

రిఖీరాం పూజ మొదలుపెట్టి, భోజనం మొత్తాన్నీదేవుడి ముందు పెట్టించి, పారోతో "తల్లీ! ఒక వంద రూపాయలు దేవుని ముందు ఉంచండి" అన్నాడు. ఈ విషయాల్లో పెద్దగా అనుభవం లేని పారో, ఆయన ఎలాచెబితే అలా చేసింది. పూజ తరువాత రిఖీరాం తృప్తిగా భోజనం చేసి, దేవుని ముందున్న పూజా-ద్రవ్యాలతోబాటూ ఆ డబ్బును కూడా తీసుకొని, మిగిలిన భోజన పదార్థాలన్నిటినీ మూట గట్టుకొని, ఇంటికి బయలుదేరాడు. పోయేముందు పారోకు గుర్తుచేసి తన దక్షిణ-200 రూపాయలు- ఇప్పించుకున్నాడు కూడా -మరి, 'వ్రతం చెడకూడదు' కదా, అందుకని! ఆపైన అతను సంతోషంగా పాటలు పాడుకుంటూ తన ఇల్లు చేరుకున్నాడు.

ఇంటికైతే చేరుకున్నాడు గానీ, మంగళ్దాసు వెనక్కి రాగానే తన ఇంటిమీదికి దండెత్తి వస్తాడని తెలుసు రిఖీరాంకు. అందుకని, అతను తను తీసుకొచ్చిన సామాన్లనీ, డబ్బునూ భార్య చేతికిచ్చి, మంగళ్దాసు వస్తే

ఏంచేయాలో చెప్పి, హాయిగా పడుకున్నాడు.

మధ్యాహ్నానికి ఇల్లు చేరుకున్నాడు మంగళ్దాసు. రాగానే భార్యను అడిగి ఏం జరిగిందో తెలుసుకున్నాడు. ఆ ఖర్చును చూసేసరికి అతనికి గుండె ఆగినంత పనైంది. 'తను లేని సమయం చూసుకొని ఇంత మోసం చేస్తాడా' అని కోపంతో ఊగిపోయాడు. ఒక పెద్ద వెదురుకట్టెను చేత బట్టుకొని, ఆవేశంగా రిఖీరాం ఇంటికి బయలుదేరాడు.

అక్కడికి చేరుకునేసరికి, అతనికి ఏడుపులు, పెడబొబ్బలు వినబడ్డాయి. ఇంటి గడపలో కూర్చొని రిఖీరాం భార్య గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నది. "అయ్యో! దేవుడా! ఏం చేసేది? నా భర్త చచ్చిపోతున్నాడు నాయనో! వద్దంటున్నా వినకుండా ఆ మంగళ్దాసు ఇంటికి పోయి భోజనం చేశాడు. అందులో ఏం విషం కలిపారో, ఏమో? ఉలుకూ పలుకూ లేదు; స్పృహలో లేడు. నాయనోయ్, నన్ను అన్యాయం చేసి వెళ్ళిపోతున్నాడు బాబోయ్!" అని గట్టిగా శోకాలు పెడుతున్నది ఆమె.

మంగళ్దాసుకు అంత చలికాలంలోనూ చెమటలు పోశాయి. కట్టె చేతిలోంచి జారి పడిపోయింది. ముఖం పాలిపోయింది. పెదిమలు ఎండిపోయాయి. "రిఖీరాం చచ్చిపోయాడంటే ఇక నన్ను జైల్లో పెడతారు- బహుశ: ఉరి తీస్తారేమో కూడా!" అని అతనికి చెప్పరానంత భయం వేసింది. కిటికీలోంచి లోపలికి చూస్తే మంచం మీద కదలకుండా పడి ఉన్న రిఖీరాం కనబడ్డాడు. ఆ పరిస్థితిలో రిఖీరాంని చూసే సరికి అతనికి ఇంకా బెదురు పుట్టింది. "రిఖిరాం స్పృహలో లేడు; కానీ ఇంకా ప్రాణాలతోనే ఉన్నాడు! అతను ఎట్టి పరిస్థితుల్లోనూ చచ్చిపోకూడదు. లేకపోతే ఇదంతా నా తలకు చుట్టుకోక మానదు" అని మంగళ్దాసు రిఖీరాం భార్య ముందుకెళ్ళి "అతనికేమీ అవ్వదు. వెంటనే ఓ టాక్సీని పిలిపించు, నగరంలో చాలా మంచి ఆసుపత్రులున్నై, మంచి ఆసుపత్రిలో చేరిస్తే ఇట్టే కుదురుకుంటాడు" అన్నాడు.

"ఆ ఆలోచన నాకు కూడా వచ్చింది. కానీ అలా చేయాలంటే కనీసం వెయ్యి

రూపాయలైనా కావాల్సి ఉంటుంది. ఇంత సీరియస్ గా ఉన్న రోగిని ఏ ఆసుపత్రి వాళ్ళూ డబ్బు లేకుండా ఉచితంగా చేర్చుకోరు" అంటూనే, రిఖీరాం భార్య "అయ్యో, దేవుడో! మమ్మల్ని బికారుల్ని చేసి పోతున్నావా, స్వామీ! నేను ఇంకెన్నాళ్ళు బ్రతకాలి, ఇలా?" అని గొంతు హెచ్చించింది.

మంగళ్దాసుకు ఇక కాళ్లూ చేతులూ ఆడలేదు. మెదడు మొద్దుబారినట్లయింది. తన పిసినారితనం ప్రక్కన పెట్టి, అతను రిఖీరాం భార్యతో " చూడమ్మా! డబ్బుకు వెనకంజ వేయాల్సిన సమయం కాదిది. త్వరగా ఏదైనా చేసి నీ భర్త ప్రాణాలు కాపాడుకోవాలి. నీ కొడుకును నాతోపంపించావంటే, నేను ఇస్తాను- ఆ వెయ్యి రూపాయలూ! కానీ- త్వరగా పంపాలి! -వెంటనే!" అన్నాడు.

అట్లా పిసినారి మంగళ్దాసుకు మరో వెయ్యి రూపాయలు వదిలాయి!

ఒకటి రెండు రోజులయ్యేసరికి, ఈ కథ ఊరంతటికీ తెలిసిపోయింది. అందరూ మంగళ్దాసును తలచుకొని కడుపుబ్బ నవ్వుకున్నారు. బంగ పట్టణానికి వెళ్లి ఎవరైనా 'మంగళ్దాస్' అన్నారంటే చాలు- అక్కడ ఈనాటికీ నవ్వుల పువ్వులు పూస్తాయి!

## అనుమానం!

రోగి: డాక్టరుగారూ, నేను కుక్కనైపోయినట్లున్నానండీ!

డాక్టరు: అవునా, ఎప్పటి నుండీ అనిపిస్తోంది, అట్లాగ?

రోగి: నేను కుక్కపిల్లగా ఉన్నప్పటి నుండీ అలాగే అనిపిస్తోంది సార్!




# జంతువుల బడి

*సేకరణ: శ్రీఅరవిందగుప్తా, పూణె.*

అనగా అనగా ఒకసారి జంతువులన్నీ సమావేశమైనాయి. "మన సమాజంలో సంబంధాలన్నీ రాను రాను చాలా సంక్లిష్టం అయిపోతున్నాయి. దీన్ని తట్టుకునేందుకు-గాను మనం ఏమైనా చెయ్యాల్సిందే, తప్పదు" అనుకున్నాయి. అన్నీ కలిసి చర్చించుకొని, భావి తరాల బాగుకోసం ఒక బడి పెట్టాలని నిశ్చయించుకున్నాయి.

ఆ బళ్ళో పరుగెత్తటం, పైకి ఎగ బ్రాకటం, ఈదటం, ఎగరటం నేర్పించాలని నిర్ణయమైంది. ఈ నాలుగూ అన్ని ప్రాణులకూ అవసరమైన మౌలిక విషయాలే- కనుక, 'విద్యార్థులందరూ ఈ నాలుగింటిలోనూ ప్రావీణ్యత సాధించాల్సిందే' అని నిశ్చయమైంది.

బాతుకు ఈదటం అసలు సమస్యే కాలేదు. నిజానికి అది తమ టీచరుకంటే బాగా ఈదింది! అది చక్కగా ఎగిరింది కూడా. కానీ పాపం,

దానికి పరుగెత్తటమే, బాగా రాలేదు. ఈ అంశంలో అది వెనకబడి ఉన్నది కనుక, ముందు కొన్నాళ్లపాటు దాన్ని బడి వదిలిన తరువాత కూడా ఉండమన్నారు. అలా దాన్ని ఎక్కువసేపు పరుగెత్తించారు. అయినా ప్రయోజనం లేకపోయింది. చివరికి అది తనకు చాలా ఇష్టమైన ఈతను ప్రక్కన పెట్టి, ఆ సమయాన్ని కూడా పరుగులు పెట్టేందుకే వెచ్చించాల్సి వచ్చింది. దాన్ని ఈ వెనకబడిన అంశంలో ఎంత కాలం నిలిపి ఉంచారంటే, చివరికి దాని పాదాలకు తీవ్రంగా గాయాలైనాయి. ఈదటంలో అది ఇప్పుడు 'సాధారణ' స్థాయికి పడిపోయింది. కానీ అలా సాధారణ స్థాయి ఉంటే బడి పరిధిలో పరవాలేదు, కనుక ఎవ్వరూ ఈ విషయమై బాధపడలేదు- బాతు ఒక్కటీ తప్ప!

ఇక కుందేలు, పరుగుల్లో ఫస్టుగా ఉండేది. కానీ చివరికి అది నరాల బలహీనతకు లోనై తప్పుకోవాల్సి వచ్చింది. తనకు అస్సలు ఇష్టంలేని ఈత కోసం మరింత ఎక్కువ సమయాన్ని వెచ్చించీ, వెచ్చించీ దాని పరిస్థితి అట్లా తయారైంది.

పైకి ఎగబ్రాకటంలో మొదటి స్థానంలో ఉన్న ఉడుత, మొదట్లో బాగానే ఉండేది. కానీ ఎగిరే తరగతిలో టీచరు దాన్ని చెట్ల కొమ్మల పైనుండి కాక, నేలపైనుండి మొదలు పెట్టమని శాసించేసరికి, దానికి మెదడులో ఏవో అడ్డుగోడలు తయారయ్యాయి. దానితో అది ఇక ఎగరలేకపోయింది. అందుకని, దాన్ని ఎగిరే తరగతిలోనే నిలిపి మరింత సాధన చేయించారు. చివరికి, పాపం, దాని కండరాలు బిగుసుకు పోయాయి- అలా దానికి ఎగబ్రాకటంలో C గ్రేడు, పరుగులెత్తటంలోD గ్రేడు వచ్చాయి.

బడి మొత్తంలోనూ క్రమశిక్షణ సమస్య ఏదైనా ఉందంటే అది గ్రద్దనే. ఎగబ్రాకే తరగతుల్లో అది మిగిలిన వాళ్లందర్నీ మించిపోయేది. అన్నిటికంటే ముందుగానే అది గమ్యాన్ని చేరుకునేది. అయితే, అలా చేసేందుకు అది తన పద్ధతుల్ని తను ఉపయోగించేది తప్పిస్తే, ఎవ్వరిమాటా వినేది కాదు.

ఇక పందికొక్కుల్లాంటి బిలాశయ జీవులైతే బడిలో చేరనేలేదు! విద్యకోసం ప్రభుత్వం వారు విధించిన పన్నును వ్యతిరేకిస్తూ అవి పోరాటం ఆరంభించాయి- ఏమంటే, నేలలో బొరియలు చేయటాన్ని పాఠ్యాంశాల్లో చేర్చలేదని వాటికి కోపం వచ్చింది. అవన్నీ తమ పిల్లల్ని ముందు ఎలుకకు, తర్వాత పందికొక్కుకు అనుచరులుగా ఉంచి శిష్యరికం చేయించాయి.

చివరికి అవన్నీ కలిసి ప్రత్యామ్నాయ విద్యనందించే ప్రైవేటు బడిని ఒకదాన్ని ప్రారంభించాయి!

## టీచర్ ఇరకాటం!

టీచర్: హోంవర్కేది?

విష్ణు: పోయింది టీచర్.

టీచర్: పోయిందా!! ఎప్పుడు?!

విష్ణు: నిన్న వీడితో పోట్లాడాను టీచర్. అప్పుడు పోయింది.

టీచర్: ఎందుకు పోట్లాడావు?

విష్ణు: మీరు పాఠాలు బాగా చెప్పరని వాడంటేనూ......

## ఇంకేం చేస్తాం?

ప్రశ్న: పులి తుమ్ముతుంటే నువ్వేం చెయ్యాలి?

జవాబు: ముందు అక్కడి నుండి పారిపోవాలి.

# అమ్మా అమ్మా చందమామ!

*గానం: A.S.గీతిక, 6 వ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

*రచన: కీ.శే.జై సీతారాం.*



అమ్మా అమ్మా! చందమామతో
ఆడుకుంటాను
రమ్మను రమ్మను - కిందికి
రమ్మను - రమ్మనవే అమ్మా!

రామా రామా! చందమామ
రాడు రామయ్యా
తోడిపిల్ల వాళ్లతోను
ఆడుకోరాదా!

అందగాడు - చందగాడు
చందమామ
అందుకేను మామతోను
ఆడుకుంటాను!

మింటి నుండి రాడు రాడు
మంటిలోనికి
మన ఇంటిలోనికి!

ఎందుకు రాడో
అడిగేస్తాను చందమామను!
ఎందుకు నీవు - కిందికి రావు?
చందమామా?

కిందికి వస్తే అందరూ నన్ను
గేలిచేస్తారు!

గేలి చెయ్యము - గోల చెయ్యము
చందమామా!

బాలలంటే నాకు చాలా
భయమౌతుందయ్యా!

భయమూ వద్దూ - గియమూ వద్దూ
రయమున రావయ్యా!

పిల్లలంతా చుట్టుముట్టి
అల్లరి చేస్తారు!

అల్లరి చెయ్యము - గిల్లరి చెయ్యము
చందమామ!

కిందికి వస్తే తిరిగి అమ్మ
పైకి రానీదు!

అమ్మనడిగి కిందికి వస్తే
ఆడుకుందాము!

మంటిలోన ఆడుకుంటే
మామ్మ తిడుతుంది

మామ్మ తిడుతుంది

ఎంత పిలిచినా చందమామ
చెంతకు రాడమ్మ
అంతదాక అన్నం వద్దు
ఆటలు నాకొద్దు!

ఏడవకయ్యా బంగరు కొండా
రామా శ్రీరామా!
చూడవయ్యా అద్దంలోను
వీడె చందురుడు!

అవునే అవునే అద్దంలోన
అడుగో చందురుడు
చిక్కినాడు చేతికి యింక
ఎక్కడికెళ్తాడు?
ఇంకెక్కడికెళ్తాడు!?

# అందుకో దండాలు

ఏప్రియల్ 14 అంబేద్కర్ జన్మదినం

*గానం : యస్. జానకి, యస్. మంజుల, యస్. నిర్మల, 7 వ తరగతి, టి. నాగమణి, 6 వ తరగతి, టింబక్టు బడి.*
*డప్పు: పి. పోతలయ్య, 8 వ తరగతి, టింబక్టు బడి.*



సాకి: అణగారిన బ్రతుకులను వెలిగించిన వాడా
నవ భారత రాజ్యాంగము నిర్మించిన వాడా
అందుకో అంబేద్కరా - దళిత ప్రజా వందనం

అందుకో దండాలు బాబా అంబేద్కరా
అంబరాన ఉన్నట్టి చుక్కలు పొడవంగ
ముందుగా నినుతలచి పాటలు పాడేము
చీకటి మా బ్రతుకుల్లో సూర్యుడు పొడవంగ
||అందుకో||

నీతల్లి - భీమబాయి
నీ తండ్రి - రాం జీ
నీ ఊరు - అంబవాడ
నీ జిల్లా - రత్నగిరి
ఏప్రిల్ 14 పుట్టిన రోజంట -
దళిత జాతి పీడితులకు పండుగ రోజంట
||అందుకో||

అంటరాని - వాడంటు
అగ్రజాతి - మూర్ఖులంతా
అడుగడున – నినుబడిలో
అవమానం - చేసినప్పుడు
అంటరాని తనమును పాటించిన వాళ్ళకు-
తగిన శాస్తి చేస్తానని శపథం చేశావు
||అందుకో||

పట్టుదలగా - ప్రాపంచపు
పెద్ద చదువు - లన్ని చదివి
రంకు నేర్పు - గ్రంధాల
రంకంతా - బయటపెట్టి
కులగజ్జి – మూర్ఖులతో

ఎనలేని - పోరుచేసి
పీడితులకు తాడితులకు హక్కులు సాధించి-
హీనమైన బ్రతుకులకు వెలుగును చూపావు
||అందుకో||

## గజ చర్మం!

ప్రశ్న: ఏనుగు చర్మం ముడతలు పడి ఉంటుంది ఎందుకు?

జవాబు: ఎవ్వరూ దాన్ని ఇస్త్రీ చెయ్యరు కదా, అందుకనీ.

## శకునం

ప్రశ్న: ఏ సమయంలో పిల్లిని చూడకూడదు?

జవాబు: నువ్వు ఎలుకవైనప్పుడు.

## రెండు రోజుల తర్వాత!

ప్రశ్న: గొంగళి పురుగుకు రెండు రోజుల వయసు వచ్చాక ఏమౌతుంది?

జవాబు: మూడు రోజులది అవుతుంది.

# చిన్నపాటలు



## వసంతకాలం వచ్చింది

*గానం: A.S. నందన, 3 వతరగతి, యు. సుమిత్ర, 4 వతరగతి, టింబక్టు బడి.*

వసంత కాలం వచ్చింది పసందు పూవ్వులు పూసినవి 2
మల్లెలు జాజులు కొల్లలు కొల్లలు || వసంత కాలం||
కోయిల కువ్వు అని కూసింది తుమ్మెద ఝుమ్మని పాడింది
పక్షులు కిలకిల మన్నాయి లేళ్ళు చెంగున ఆడినవి || వసంత కాలం ||
తోటలు పచ్చగ విరిసినవి మత్తుగ పగళ్ళు వెలిగినవి
రాతిరి వెన్నెల నవ్వింది పాటల లోకం నిండినది || వసంత కాలం||



## రోజా పువ్వు

*గానం: సి. హరిత, మూడవ తరగతి, టింబక్టు బడి.*

రోజా పువ్వు పూసింది
కమ్మటి వాసన వచ్చింది
దాని పక్కన ముల్లుంది
అమ్మో బాబోయ్ గుచ్చుకుంది

# బంతి పాట



*గానం: పి. హర్షవర్ధన్‌రెడ్డి, రెండవతరగతి, టింబక్టు బడి.*

బంతి బంతి అది నా బంతి

కాళ్ళు లేవు చేతులు లేవు

పొట్ట నిండా గాలి

ఎగురుతుంది దుంకుతుంది బంతి

# అక్కయ్యక్కయ్య



*గానం: రజని, 4 వతరగతి, టింబక్టు బడి.*

అక్కయ్యక్కయ్య-శాంతక్కయ్య

బావేడి?-మద్రాస్ పోయినాడు

ఏంతెచ్చాడు?-పప్పులు తెచ్చాడు

పప్పులేవి? -బుడ్డోడు తిన్నాడు

బుడ్డోడేడి? -పొయ్యిలో పడ్డాడు

ఏంకాలింది? -మీసంకాలింది.

# జగ్ జగ్గి జాలాకు



*గానం: సుధ, 5 వ తరగతి, టింబక్టు బడి.*

జగ్ జగ్గిజాలాకు- ఏంపేరుపెడదాము ?
చింతకిందకూరాకు- ఏంపేరుపెడదాము ?
వీణానిపెడదాము - యా వూరికి ఇద్దాము?
యావూరికియిద్దాము? -రాచూరికి యిద్దాము
రాకుండా పోకుండా రాయడ్డు పెడదాము
కోడెట్లాకూసేది-కొక్కొరక్కో!

# క్రికెట్



*గానం: పవన్, 4 వ తరగతి, టింబక్టు బడి.*

ఏమిఏమిఆటమ్మా?
క్రికెట్ క్రికెట్ ఆటమ్మా
సచిన్ వచ్చె చారే కొట్టె
సౌరవ్వొచ్చె సిక్సర్ కొట్టె
ఆజార్ వచ్చె ఔటాయె
కరెంట్ పోయె ఖతం ఆయె!

# కాకీ,కాకీ

*గానం: కల్పన, 1 వతరగతి, విజ్ఞంస్కూలు, గుడిపాల, చిత్తూరు జిల్లా.*

కాకీ,కాకీ, గువ్వలకాకీ!
మాచేనులో వాలొద్దు-
మల్లెపూలు తెంచొద్దు-
మానాన్నేమొ బీదోడు ;
మాయమ్మేమొ రాకాసి;
నేనేమొ పుట్ట గోసి!

# బిస్కెట్లు

*గానం: ధనుశ్రీ, నందకుమార్, విజ్ఞంస్కూలు, గుడిపాల, చిత్తూరు జిల్లా.*

బిస్కెట్లమ్మా బిస్కెట్లు
గోడమీద బిస్కెట్లు
డబ్బా నిండా బిస్కెట్లు
మూడు బిస్కెట్లు తిన్నాను
అమ్మకు కోపం వచ్చింది
మూడు గుద్దులు గుద్దింది.

# మెలికలు

*నిర్వహణ: ఆనంద్, కొత్తపల్లి బృందం.*

ప్రతి చదరంలోనూ రెండు గళ్ళకు రంగు వేసి ఉన్నది. ఆ రెండు గళ్లనూ కలుపుతూ మెలికల దారినొకదాన్ని గీయండి. ఆ దారిలో అంకెలు సరైన వరస క్రమంలో ఉండేట్లు చూడండి(ఉదాహరణకు: 1,2,3,4, 1,2,3,4.. ఇలా అన్న మాట). మీరు గీసిన గీత అన్ని అంకెలనూ కలుపుకొని పోవాలని మరువకండి.




అర్థమైందా, మీరు చేసేందుకు, ఇప్పుడు కొన్ని సులభంవి చెయ్యండి:

| | | |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 2 | 1 | 2 |
| 3 | 1 | 3 |

| | | |
|---|---|---|
| 1 | 3 | 1 |
| 2 | 3 | 2 |
| 1 | 2 | 3 |

ఇప్పుడు నాలుగు గడులవి కొన్ని:

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 2 | 3 |
| 3 | 1 | 1 | 4 |
| 4 | 2 | 1 | 2 |
| 3 | 4 | 3 | 4 |

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 3 | 1 | 1 | 2 |
| 4 | 2 | 4 | 3 |
| 1 | 2 | 3 | 4 |

| | | | |
|---|---|---|---|
| 1 | 3 | 4 | 1 |
| 3 | 2 | 2 | 2 |
| 4 | 3 | 1 | 3 |
| 1 | 2 | 4 | 4 |

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 4 | 2 |
| 2 | 3 | 1 | 3 |
| 3 | 1 | 4 | 3 |
| 4 | 1 | 2 | 4 |

ఇంకొంచెం పెద్దవి చెయ్యండి, ఇప్పుడు:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 4 | 1 | 2 | 3 |
| 3 | 4 | 3 | 2 | 1 | 4 |
| 1 | 2 | 3 | 4 | 3 | 4 |
| 3 | 2 | 1 | 4 | 2 | 1 |
| 4 | 1 | 2 | 3 | 1 | 2 |
| 2 | 3 | 4 | 1 | 3 | 4 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 1 | 3 |
| 4 | 3 | 2 | 1 | 2 | 4 |
| 1 | 3 | 3 | 4 | 1 | 2 |
| 2 | 1 | 4 | 2 | 3 | 4 |
| 2 | 4 | 1 | 1 | 2 | 1 |
| 3 | 2 | 3 | 4 | 3 | 4 |

## కొత్తపల్లి బృందం

**సారథ్యం:** సుబ్బరాజు

**ప్రధాన సంపాదకులు:** నారాయణ

**సంపాదక వర్గం:** మోహనయ్య, జయచంద్ర, మురళి.

**సాంకేతిక బృందం:** ఆనంద్, లక్ష్మి, లీల.

**చిత్రాలు:** శివప్రసాద్, అడవిరాముడు, నాగమణి, మమత, సురేష్, చంద్రకాంత్, వేణు, హరికృష్ణ.

**రూపకల్పన:** సుచరిత, రాజకుమార్

**ఆర్థిక వ్యవహారాలు:** అలివేలమ్మ



## చందా వివరాలు

**సంవత్సర చందా:** 200/ రూ.

చందాను 'కొత్తపల్లి ట్రస్టు' పేరిట మనీఆర్డర్ లేదా డి.డి లేదా చెక్కు రూపంలో కట్టవచ్చును. డి.డి., చెక్కులకు బ్యాంకు చార్జీలు (25రూ) కలపాలని మనవి.

**చందాలకై చిరునామా:**

కొత్తపల్లి ట్రస్టు,
2-312, న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,
అనంతపురంజిల్లా, 515101.

**బ్యాంకు ద్వారా చందా కట్టడానికి వివరాలు:**

సి.ఎచ్. రాము, A/c No:62079470871,
స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు, శాంతి నగర్ బ్రాంచి, హైదరాబాద్.

డబ్బు కట్టిన వివరాలను ఇమెయిలు/ ఫోను/ ఉత్తరం ద్వారా కొత్తపల్లికి తెలియపరచగలరు.

ఇమెయిలు: team@kottapalli.in

ఫోను: 08559 240222.

**కృతజ్ఞతలు:**

పత్రికకోసం నిరంతరంగా పిల్లల రచనల్ని అందించి సహకరిస్తున్న ప్రకృతిబడి, టింబక్టు బడి, విజ్ఞం స్కూల్ యాజమాన్యాలకు కృతజ్ఞతలు. వెబ్ సైటుకు వెన్నుదన్నుగా నిల్చిన infogami యాజమాన్యానికి, దాన్ని సుసాధ్యం చేసిన python భాషకు, చక్కని ఆపరేటింగ్ సిస్టం linux ను అందించిన ubuntu వారికి, గొప్ప వ్యవస్థని పూర్తిగా ఉచితంగా అందిస్తున్న OpenOffice వారికి, తెలుగును రప్పిస్తున్న Unicode, Scim, Baraha లకు, చిత్రాలను సరిదిద్దే Software Gimp నిర్మాతలకు, శబ్దాలను చక్కబరచే Software Audacity నిర్మాతలకు కృతజ్ఞతలు.

మంచి పుస్తకం :



## వేలి ముద్రలు- వేల బొమ్మలు

బొటన వేలిని స్టాంపు పాడ్ మీద అద్ది, కాగితం మీద ముద్ర వేయండి. ఒక సారి దీక్షగా దాన్ని చూడండి. ఆ వేలి ముద్రలో మీకు ఏవేవో ఆకారాలు కనబడతాయి, లీలగా. పెన్నుతోటో, కుంచెతోటో దాని చుట్టూ గీసి మీ ఊహలకు రూపం ఇవ్వండి!





ఇట్లా వేలిముద్రలతో ఎన్నో బొమ్మలు గీయవచ్చు. జంతువులు, పూలు, చెట్లు, మనుషులు- వేలాది బొమ్మలు తయారు చేయచ్చు, అద్భుతంగా! ఈ పనిలో మొదట్లో మీకు కొంత సాయం అవసరమవ్వచ్చు- ఆ సాయం చేస్తుంది, ఓ చిన్ని పుస్తకం: **అరవింద్ గుప్తా గారు రచించిన "వేలి ముద్రలు-వేలబొమ్మలు".**






అరవిందగుప్తాగారు పూణే కేంద్రంగా పుస్తకాలతోటీ, పిల్లలతోటీ, చేతులతోటీ పనిచేస్తూ, చేయిస్తూ ఉన్నారు (www.arvindguptatoys.com).

ఐదురూపాయల ఈ చిన్ని తెలుపు-నలుపు పుస్తకాన్ని జనవిజ్ఞానవేదిక, హైదరాబాద్ బుక్ ట్రస్టు వాళ్ళు సంయుక్తంగా 2003 లో అచ్చు వేశారు.







ఈ పుస్తకం రంగుల్లో ఇంకా ముచ్చటగా ఉంటుంది, కదూ!